## శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

**2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)**

సంప్రదించ వలసిన అడ్రసు :

**6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్**
**హైద్రాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320**

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహ్మస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండీ భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించవలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

నిచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి — అధ్యక్షులు

మేడా నరసింహులు శ్రేష్ఠి — ప్రధాన కార్యదర్శి

V.P.- A5

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

**హెడ్ ఆఫీసు : కంభం**  **స్థాపితం : 1961**  **బ్రాంచి ఆఫీసు : శ్రీ శైలం**

✆ : 2262 ప్రకాశం జిల్లా.  ✆ : 3158 (S.T.D. 085195) కర్నూలు జిల్లా.

అతి పవిత్రమైన జ్యోతిర్ లింగములలో రెండవది యైన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. యినను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కావర్ డ్యామ్, ప్రక్కనే నున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడుచున్నందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం. దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 109 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది. నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండి మూడవ సోమవారం వరకు జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు</u> : ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌లలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందగలరు. అట్టి సభ్యత్వం పొందు దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకుల "18×15" అంగుళములు (ఫ్రేమ్‌తోసహా) గల దాత ఫొటో సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు.1160-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి ధాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫొటో సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవిత సభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. : ప్రతియొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించు చున్నాము.

యిట్లు

పాలకవర్గం

అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

వైశ్య ప్రబోధిని
( మాసపత్రిక )
స్థాపితము
1969



సంపుటి
26



సంచిక
6



ఫిబ్రవరి–1995



సంపాదకులు :
'సంఘోద్ధారక',
'వైశ్యభూషణ'
పి.లక్ష్మీకాంతంశ్రేష్ఠి



ప్రాప్తిస్థానం
ఫోన్ : 45025
వైశ్య ప్రబోధినీ
కార్యాలయం
"వాసవీ భవన్"
జయనగర్ కాలని,
విద్యామందిర్
తూ॥ భాగం
కడప – 516 002.


సంపాదకీయం

# రాష్ట్ర ప్రభుత్వ ద్వంద్వ వైఖరి వర్తకుల ఆవేదన

ఒకప్రక్క రాష్ట్రములో పన్నుల విధానాన్ని సరళతమం చేస్తామంటూనే, మరోప్రక్క, అనేక వస్తువులపై పన్నులను పెంచడమూ, చెల్లియ్య కమిటీ సిఫార్సుల్లో ఒక్కటైన 'వాట్'ను అమలు చేస్తామంటూన్న,-

ఇప్పటి తెలుగు దేశం ప్రభుత్వ ద్వంద్వ వైఖరి రాష్ట్రములోని వర్తకులను అయోమయములో పడేసింది.

మొదటి అంశాన్ని విని ఆనందించిన వర్తకులు, వెన్వెంటనే ప్రభుత్వం పలికిన రెండవ అంశాన్ని విని ఆ ఆనందానికి అంతలోనే స్వస్తి పలికి, తిరిగి ఆలోచనలో పడ్డారు.

గత కాంగ్రెస్ ప్రభుత్వము టర్నోవర్ స్థానములో 'వాట్'ను ప్రవేశపెట్టడం "పెన్నం మీది నుండీ పొయ్యిలోకి అన్నట్లుగా ఉందని" ఆనాడే వర్తకులు వ్యతిరేకించారు. పెద్ద ఎత్తున నిరసనను ప్రకటించారు. విధిలేని పరిస్థితులలో అప్పటి ప్రధానసచివులు శ్రీ విజయ భాస్కరరెడ్డిగారు 'వాట్' ప్రతి పాదనకు స్వస్తి పలికారు.

టర్నోవర్ స్థానములో 'వాట్' ప్రవేశ పెట్టిన కాంగ్రెసు ప్రభుత్వ విధానానికి, రాష్ట్రములోని వర్తకులతో బాటు, ఈ నాటి తెలుగు దేశం వారు కూడ స్వరం కలిపి తమ అయిష్టతను ప్రకటించి, వర్తకలోక సానుభూతిని కూడ పొందారు. ఆ తెలుగు దేశం వారే తమకు తఖతు లభించగానే, గతాన్ని విస్మరించి, ప్లేట్ ఫిరాయించడం వర్తకులకు అయోమయం కాక ఏమౌతుంది

రాష్ట్రములో సంపూర్ణ మద్యపాన నిషేధాన్ని అమలు పరచడమూ, రెండు రూపాయలకేకిలో బియ్యం ఇవ్వడమూ తెలుగు దేశం ప్రభుత్వం యొక్క సాహసోపేతమైన చర్యగా అభినందించడం అతిశయోక్తి కాదు.

ఈ రెండింటినీ ఎరగా చూపి, వర్తకులపై భారం పడే విధంగానూ, ఇప్పటికే అంబరాన్ని అంటుచున్న ధరలు మరీ పెరిగి, సామాన్య ప్రజల జీవితాలలో అగ్ని కీలలు రగుల్కొనేందుకు మరింత తోడ్పడే విధంగానూ, చేసేందుకు ప్రయత్నిస్తే ఏ ప్రభుత్వాన్ని కూడ ప్రజలు, వర్తకులు సహించరు అన్నది గత అనుభవాలనుండీ ఈ ప్రభుత్వం గుర్తించడం ఎంతో అవసరం.

'వాట్'ను అమలులో పెట్టుటవల్ల ధరలు పెరగడమొక్కటే కాదు. అమ్మకం పన్ను శాఖాధికారుల దయా దాక్షిణ్యాలపై వర్తకులను మరింతగా ఆధార పడేటట్లు కూడ చేస్తుంది. ఇప్పటికే అమ్మకం పన్ను శాఖాధికారులు తమ యెడల చూపే నిరంకుశ వైఖరికి, వర్తకులు భీతిల్లు మన్నారు.

అమ్మకం జరిగే ప్రతి దశలో పన్ను శాతం పెరిగే పద్ధతే 'వాట్'. ఈ పద్ధతి వల్ల రాష్ట్ర ప్రభుత్వం ఆశించిన విధంగా రాష్ట్రాదాయం పెరగక పోగా, పన్ను ఎగవేత మరింతగా పెరుగుతుంది కూడ.

పన్నులు ఏమాత్రము పెరిగినా భరించలేని స్థితిలో ఇప్పటి ప్రజలున్నారు. అమ్మకం పన్ను అధికారుల వేధింపులు, సాధింపులు, ముడుపులు చెల్లింపులలో రాష్ట్రములోని వర్తకులు తురీయ స్థితిలో ఉన్నారు. ఈ రెండు వాస్తవాలను ఇప్పుడు దొరతనం చెలాయిస్తున్న తెలుగు దేశం ప్రభుత్వం నిత్యమూ మననము చేసుకోవాల్సి ఉంది.

రాష్ట్రములోని పన్ను విధింపు పద్ధతిని మరింత సరళతమం చేస్తామన్న చల్లని వాక్కు మాత్రమే అటు ప్రజలకూ, ఇటు వర్తకులకూ సంతోషకరంగా ఉంటుంది. ఆ కోవలోనే రాష్ట్ర ప్రభుత్వం తన ఆలోచననూ, ప్రయత్నాన్నీ సాగించాలి.

రాష్ట్రములో ఇప్పుడున్న పన్ను విధింపు పద్ధతిని మరింత సరళతమం చేసి, పన్ను విధింపులో ఇప్పుడున్న లొసుగులను పూర్తిగా తొలగించ గలిగిన ఎడల పన్ను ఎగవేత గణనీయంగా తగ్గుతుంది. పన్ను ఎగవేత తగ్గడమంటే రాష్ట్ర ప్రభుత్వం ఆదాయం తనంత తానుగా పెరగడమే.

రాష్ట్రములో ఇప్పుడున్న వివిధ దశల్లోని పన్ను విధింపు పద్ధతిని పూర్తిగా మార్చి, ఒకే దశలో, అంటే రాష్ట్రములో జరుగు మొదటి అమ్మకం దశలోనే పన్నును చెల్లించునట్లుగా, రాష్ట్రములో ఇప్పుడు అమలులో ఉన్న "1956, ఆంధ్ర ప్రదేశ్ సామాన్య అమ్మకం పన్ను" చట్టాన్ని సవరించడమొక్కటే సరియైన మార్గం. ఇందు వల్ల రాష్ట్ర ప్రభుత్వానికి అమ్మకం పన్ను చట్టం ద్వారా వచ్చే ఆదాయం గణనీయంగా పెరుగుతుంది. అమ్మకం పన్ను శాఖాధికారుల అదిరింపులూ, బెదిరింపులూ, సాధింపులూ, వర్తకులకూ తప్పుతాయ్.

# ఆంతర్యం తెలియని ఆవేదన మంచిది కాదు

గత (జనవరి 1995) సంచికలో మేము వ్రాసిన 'ప్రకటనలు తెచ్చిన ప్రమాదం' అనే సంపాదకీయాన్ని ప్రశంసిస్తూ పలువురు వ్రాయగా ఒకరిద్దరు దాన్ని విమర్శిస్తూ వ్రాశారు. అందులో తిరుపతిలోని సీతమ్మ ట్రస్టు వారూ ఒక్కరుకావడం విశేషం. ఏదో మనసులో పెట్టుకొని ఆలోచించే వారు ఎప్పుడూ సంపాదకీయాలలోని ఆంతర్యాన్ని గ్రహించలేరు. కామెర్లవ్యాధి రోగికి ప్రపంచమంతా పచ్చగానే కన్పిస్తుంది.

రాష్ట్రములోని అనేక మంది వైశ్య సోదరులు కేవలం పత్రికా ప్రకటనల మాత్రముతోనే తృప్తిపడి, తమ బాధ్యతను నెరవేర్చినట్లుగా భావిస్తున్నారనీ వారి ఆవేదనను కార్యరూపములో చూపడము లేదు. అవసరమైన రీతిలో స్పందించడము లేదు, అనే విషయాన్ని స్పష్టంగా తెలియజేయడమే ఈ, మా, సంపాదకీయములోని ఆంతర్యం. సీతమ్మ ట్రస్టు నిర్వాహకులకు ఇప్పుడు కావలసినది పత్రికా పరమైన సానుభూతి కాదు. ఆర్థిక సహకారం. ట్రస్టువారి ఆశయం నెరవేరాలంటే లక్షలాది రూపాయలు కావాలి. కేవలం ట్రస్టువారి కృషి వల్లనే ఇది సుసాధ్యము కాదు. ఈ విషయాన్ని రాష్ట్రములోని వైశ్య సోదరులకు తెలియజేయడమే ఈ సంపాదకీయాన్ని వ్రాయడములోని మా ఆంతర్యం. ఆ విధంగా, పుంఖాను పుంఖాలుగా పత్రికా ప్రకటనలు చేసిన వైశ్య సోదరులు ఏమాత్రము తమ కృషికి తోడ్పడినారో, తోడ్పడుచున్నారో! ఒకసారి పరిశీలించడం అవసరమని ట్రస్టు సభ్యులను కోరుచున్నాం. అప్పుడే ఈ సంపాదకీయములోని అసలు ఆంతర్యం తెలుస్తుంది. ప్రచురించే పత్రికలు ఉంటే ప్రకటనలు చేసే వైశ్యసోదరులకు కొదవ ఉండదు. కనీసం వారు ఆ పత్రిక మనుగడకు కూడ ఒక్క పైసా ఇవ్వరు. కేవల పత్రికా ప్రకటనలు ఇచ్చేవారే తమకు శ్రేయోభిలాషులనీ, వారే వాస్తవము గ్రహించిన వారనీ, అంతే మాకు చాలును అని ట్రస్టువారు మురిసిపోతే ఎవరికీ అభ్యంతరం ఉండదు.

రాష్ట్ర సాంస్కృతిక వ్యవహారాల దర్శకులు శ్రీ కె.వి.రమణాచారి ఐ.ఎ.యస్., గారి కుమార్తె చి॥ వీణాధరి వివాహం, కీ॥ శే॥ టి.వి. రామాచార్యులు గారి కుమారులు చి॥ శ్రీనివాస్ గారితో 5.2.1995వ తేదీన సికింద్రాబాద్ లోని "హరిహర కళా భవనము"లో వైభవంగా జరిగింది. పలువురు మంత్రులూ, రాష్ట్రస్థాయి అధికారులూ, అనధికారులూ వివాహములో పాల్గొని వధూ వరులను ఆశీర్వదించారు.

# శ్రీ వాసవీ యజ్ఞము

"యజాదేవ పూజా సంగతి కరణ దానేషు" అని యజ్ఞపదానికి నిర్వచనము. యజ్ఞములు అనగా దేవతలను ఆరాధించు మార్గములు, క్రియలుగలవి - అని పై నిర్వచనానికి అర్థము.

శ్రౌతములు, స్మార్తములు అని యీ యజ్ఞాలు రెండు విధాలు.

అగ్నిష్టోమము, అతిరాత్రము, అప్తోర్యామము, సాంతపనము, వాజపేయము, పౌండరీకము, అశ్వమేధము మొదలగునవి శ్రౌతయజ్ఞాలు. ఇవి పూర్తిగా కర్మకాండకు సంబంధించినవి. ఈ శ్రౌతయజ్ఞాలు చేయుటకు కావలసిన అర్హత, యోగ్యత కలిగి విధి విధానము పూర్తిగా తెలిసిన ఋత్విజులు ఇప్పుడు బహు కొద్దిగా ఉన్నారు. శ్రౌత యజ్ఞ విధానములు పూర్తిగాతెలిసిన వేదపండితులు ఇప్పుడు లేరని కూడ కొందఱి భావన.

ద్రవ్యయజ్ఞము, తపోయజ్ఞము, యోగ యజ్ఞము, స్వాధ్యాయ యజ్ఞము, జ్ఞాన యజ్ఞము అనునవి స్మార్త యజ్ఞములు. ఈ స్మార్త యజ్ఞములు తిరిగి ఐదు రకాలు.

దేవాలయాలు, ప్రతిష్ఠా కార్యక్రమాలు మొదలగు దైవ, ధర్మ, పుణ్య సంబంధాలలో చేయుయజ్ఞములు ద్రవ్యయజ్ఞాలు.

కఠినమగు నియమములతో ఉపవాసాదులలో చేయు యజ్ఞములు తపోయజ్ఞాలు. చాతుర్మాస్య వ్రతాలు, కృచ్ఛ చాంద్రాయణాది నియమాలతో కూడిన వ్రతాలు, ఆకులు, కూరలు, గాలి, ఆహారంగా తీసుకొని చేయు కఠోర వ్రతములు కూడ తపోయజ్ఞములే.

ప్రాతంజలి మహర్షి చెప్పిన యోగ సూత్రాలు ఆధారంగా అష్టాంగయోగముల ద్వారా చేయు యజ్ఞములు యోగ యజ్ఞాలు. అష్టాంగ యోగములు అనగా యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులు.

ఋగ్వేదము, యజుర్వేదము (శుక్ల యజుర్వేదము) సామవేదము, అథర్వణవేదము, బ్రహ్మ సూత్రాలు, 108 ఉపనిషత్తులు, భగవద్గీత మొదలగు వైదిక, వేదాంత గ్రంథములను పారాయణము చేయుట స్వాధ్యాయ యజ్ఞము.

మానవుని మనస్సును పవిత్రముచేసి, వారిలో చిత్త శుద్ధిని కలిగించి, వారి దృష్టిని పరమేశ్వరుని వైపు మరల్చుటకు ఈ యజ్ఞములు పరమ సాధనములు.

పై చెప్పిన ద్రవ్య యజ్ఞము జపము, అర్చనము, ధ్యానము, హోమము. అని తిరిగి నాలుగు రకాలు.

ఒక ప్రధాన దేవతను హృదయములో నిలుపుకొని, ఆ దేవతకు సంబంధించిన మంత్రమును నియమ బద్ధముగా జపించడమే జపము. బాహ్య జపము, మానసిక జపము అని యీ జపము తిరిగి రెండు విధాలు. ఇతరులకు వినిపించునట్లు ఉచ్చైస్వరముతో పలుకుచూ చేయు జపము బాహ్యము. ఇతరులకు వినిపించకుండా మనస్సులోనే చేయు మంత్ర జపము మానసికము. మానసికముగా అనగా

మౌనముగా చేయు జపమే ప్రశస్తము.

తన యిష్టదైవము యొక్క విగ్రహాన్ని కానీ, ఛాయా చిత్రాన్ని కానీ ముందు ఉంచు కొని, చేయుట అర్చనము.

ఆజ్యము, సమిధలు, హవిస్సు మూడింటితో చేయునది హోమ యజ్ఞము.

కేవలము మానసికంగా, ఇతరులకు ఏమాత్రమూ వినిపించకుండా చేయు సాధన ధ్యానము.

పై నాలుగింటిలోనూ ధ్యాన యోగ్యమే ప్రశస్తము. సత్యమును తెలుసుకొనుటకు ధ్యానమునకు మించిన సాదనమే లేదు. ధ్యానము నకు కావలసిన ఏకాగ్రతను పొందుటకు జపము, అర్చనము, హోమములు సోపానములు.

యజ్ఞాన్ని ముఖ్యంగా ఒక దేవతను ఉద్దేశించి చేస్తారు. ఆజ్యము, సమిధలు, హవిస్సులతో ఈ యజ్ఞాన్ని చేస్తారు. మనము యజ్ఞములో వేసిన పై మూడిం టినీ యజ్ఞేశ్వరుడు ఆదేవతకు అందిస్తాడు. అందుకే యజ్ఞేశ్వరునికి 'హవ్య వాహనుడు' అని పేరు. అగ్ని తెచ్చిన ఆ హవిస్సును భుజించి, ఆ దేవత విశ్వ శాంతినీ, లోక కల్యాణాన్నీ ప్రసాదిస్తుంది.

ఇక ప్రస్తుతాంశము శ్రీ వాసవీ మహా యజ్ఞము. శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరిని ఉద్దేశించి, ఆమెను సమంత్రంగా ఆహ్వా నించి చేసే యజ్ఞము కాబట్టి ఈ యజ్ఞానికి "శ్రీ వాసవీ మహా యజ్ఞము" అని పేరు. త్రయాహ్నిక (మూడుపగల్లు) దీక్షనుండీ మండల పర్యంత దీక్షతో ఈ యజ్ఞాన్ని చేయవచ్చు. ఏకాహ్నిక దీక్ష అనగా ఒక్క రోజు దీక్షతో మాత్రమే చేసే యజ్ఞాన్ని వేదము అంగీకరించదు. అందువల్ల త్రయా హ్నిక దీక్షకు తక్కువగా యీ యజ్ఞాన్ని చేయరాదు.

ప్రదేశము :— శ్రీ వాసవీ మహాయజ్ఞము లేక శ్రీ వాసవీ హోమము చేయుటకు నిర్ణయించబడిన ప్రదేశము పరిశుద్ధ మైనదిగా, మంచి గాలి, వెలుతురు వచ్చు నదిగా, పరిసరములనుండీ ఎటువంటి ఉపద్రవములు రాకుండునదిగా ఉండాలి.

యజ్ఞశాల :— యజ్ఞశాలనే 'యజ్ఞ మండపము' అని కూడ అంటారు. యజ్ఞ మండపమును చచ్చౌకము అనగా నాలుగు మూలలు కలిగినదై, వీలైనంత విశాల మైనదిగా నిర్మించాలి. పైనకప్పు ఉండాలి. కప్పు అనగా ఆచ్ఛాదన లేకుండా చేయు యజ్ఞము ఫలము ఇవ్వదు. యజ్ఞశాలకు నాలుగు దిక్కుల నాలుగు ద్వారా లుండాలి. యజ్ఞము జరుగు అన్నిదినము లలో యజ్ఞశాల అంతటా నీళ్ళు చల్లాలి. పసుపు, గోధుమపిండి, కుంకుమలతో ముగ్గులు వేసి అలంకరించాలి. నాలుగు ద్వారముల వద్దనూ వైశ్య పతాకములు ఎగురు చుండవలెను.

యజ్ఞగుండము చతురస్రముగా ఉండాలి. కొన్ని ప్రత్యేక ప్రయోజనాలను ఆశించి యజ్ఞాన్ని చేసేటప్పుడు మాత్రమే గుండము చతురస్రముగా గాక ఇతర విధంగా ఉండాలి. వ్రేల్చు ఆహుతులను బట్టి గుండము యొక్క లోతు ఉండాలి.

యజ్ఞానికి కావలసిన వస్తువులు. 24 అంగుళముల పొడవుగల కఱ్ఱతో చేయ బడిన స్రువములు రెండు లేక నాలుగు. యజ్ఞ సమిధలు మోదుగు, మద్ది, మేడి, మామిడి, మారేడు మొదలగు సమిధలు

యజ్ఞ వేదికను బట్టి చిన్నవి, పెద్దవి. ఈ సమిధలు పురుగు పట్టినవి, మలిన ప్రదేశ మందు లభ్యమైనవి, అపవిత్ర వస్తువుతో కలిసి దూషితమైనవిగా ఉండరాదు.

హోమద్రవ్యాలు :— ఈ హోమ ద్రవ్యాలు సుగంధితములు, పుష్టికార కములు, మిష్టములు, రోగనాశకములు అని నాలుగు విధాలు.

సుగంధితము :— కస్తూరి, కుంకుమ పువ్వు, అగరు, తగరు, తెల్లచందనము, ఏలకులు, జాజికాయ, జాపత్రి మొదలగు నవి.

పుష్టికారకములు :— ఘృతము, పాలు, ఫలములు, దుంపలు, అన్నములు, బియ్యము, గోధుమలు, మినుములు మొదలగునవి. ఇక్కడ ఘృతము అని చెప్పినా ఆజ్యమునే వాడవలెను. ఆజ్యము అన్నా, ఘృతమన్నా ఒక్కటే గదా అని సందేహము కలుగవచ్చు. వైదికపరిభాషలో ఘృతమనగా పేరిన నెయ్యి. ఆజ్యమనగా కరిగి(నీటివలె) ఉన్న నెయ్యి. యజ్ఞములో ఆజ్యమునే వాడాలి.

మిష్టములు :— చక్కెర, తేనె, ఖర్జూరము, పండ్లు మొదలగునవి.

రోగనాశకములు :— సోమలత అనగా తిప్పతీగె మొదలగు ఓషధులు.

మూల మంత్రము :— ఓం, శ్రీం, హ్రీం, సౌః, క్లీం, హైం శ్రీ వాసవీ కన్యకే మహ్యం సర్వ సౌభాగ్యం దేహి, దేహి స్వాహా.

యజ్ఞ ప్రారంభ సమయాన శ్రీ వాసవీదేవి విగ్రహాన్ని చక్కగా, కన్నులకు విందుచేసే విధంగా, మనోజ్ఞంగా అలంక రించి, యజ్ఞవాటికలో ఒక ఎత్తైన ఆసనముపై ఉంచాలి. తరువాత కలశ స్థాపన చేసి ఆవాహన చేయాలి.

యజ్ఞ ప్రారంభ దినమున యజ్ఞము చేయుచున్న శ్రీ వాసవీ దేవ్యాలయ నిర్వాహకసంఘం అధ్యక్షులు ఋత్వి జులకు దీక్ష నివ్వాలి. దీన్నే ఋత్వి గ్వరణము అంటారు. ఋత్విగ్వరణ సమయములో కర్త అనగా శ్రీ వాసవీ యజ్ఞము చేయుచున్న శ్రీ వాసవీ దేవ్యాలయ నిర్వహణా సంఘం అధ్యక్షులు గానీ, లేక ప్రత్యేకముగా ఈ యజ్ఞ నిర్వహణ కై ఏర్పడిన సంఘం అధ్యక్షులు కానీ, 'ఓం మావసోః సదనే సీద' – అని ఋత్విజుని ప్రార్థించాలి. అందుకు ప్రతిగా ఋత్విజుడు 'ఓం సీదామి' అని పలికి దీక్షను స్వీకరించి నియమముతో ఆసనము పై కూర్చుండాలి. మంచి విద్వాంసులు, ధర్మాత్ములు, జితేంద్రియులు, లోభము లేని వారు, పరోపకారులు, దుర్వ్యసనము లకు లోను గాని వారు, మంచి శీలము కలవారు, వైదికమతానుయాయులు, వేదము బాగా తెలిసిన వారిని మాత్రమే ఋత్విజులుగా ఎన్నుకోవాలి. ఒకరి నుండీ నలుగురి వరకూ ఋత్విజులుగా వరించ వచ్చును. నలుగురిని వరించడమే ఉత్తమం. ఒకరిని మాత్రమే ఎన్నుకుంటే అతడు పురోహితుడు అనబడతాడు. ఇరువురిని ఎన్నుకుంటే ఆ యిర్వురిలో ఒకరు ఋత్విజుడు, మరొకరు పురోహితుడు అనబడతాడు. ముగ్గురిని ఎన్నుకుంటే అందులో ఒకరు ఋత్విజుడు, మరొకరు పురోహితుడు, మూడవ వాడు అధ్యక్షుడు అనబడతాడు. నలుగురిని ఎన్నుకోవడమే ఉత్తమం అని నిర్ణయించుకొన్నాం కనుక ఆ నలుగురు వరుసగా హోతా, అధ్వ ర్యుడు, ఉద్గాతా, బ్రహ్మ అని పిలువ

బడతారు. వారిలో హోత యజ్ఞ వేదికకు పశ్చిమదిశన తూర్పు ముఖము చేసి కూర్చోవాలి. అధ్వర్యుడు వేదికకు ఉత్తర దిశన దక్షిణ ముఖము చేసి ఆసీనుడు కావాలి. ఉద్గాత వేదికకు తూర్పు దిశన పశ్చిమ ముఖము పెట్టి కూర్చోవాలి. బ్రహ్మ వేదికకు దక్షిణ దిశన ఉత్తర ముఖము చేసి ఆసీనుడు కావాలి. ఇక, యజమానుడు అనగా యజ్ఞ నిర్వహణా సంఘమునకు నేతృత్వము వహించు వాడు వేదికకు పశ్చిమ దిశన కానీ, వేదికకు దక్షిణ దిశన కానీ ఆసీనుడు కావాలి. పశ్చిమ దిశన కూర్చొన్న ఆయన ముఖము తూర్పు నకు, దక్షిణ దిశన కూర్చొన్న ఆయన ముఖము ఉత్తరము చూచునదిగా కానీ ఉండాలి.

యజ్ఞమునకు కావలసిన అగ్నిని ఒక సమీప వైశ్యుని ఇంటి నుండి తేవచ్చు. లేక, నెయ్యితో దీపమును పెట్టి దానితో కర్పూరమును వెలిగించి దానిని ఒక పాత్రలో ఉంచి హోమ గుండము మధ్యలో ఉంచవచ్చు.

పై విధముగా అగ్నిని తెచ్చిన తర్వాత మొదట అగ్ని హోమము చేయాలి. తరువాత 'ఓం, శ్రీం, హ్రీం, సౌః, క్లీం, హైం శ్రీవాసవీ కన్యకే మహ్యం. సర్వ సౌభాగ్యం, దేహి దేహి స్వాహా' అను మూలమంత్రము ను పలుకుచూ స్వాహా అన్నప్పుడల్లా సమిధలు, అన్నము, ఆజ్యము గుండము లో వేస్తూ 102 సార్లు హోమము చేయాలి. తదుపరి శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ అష్టోత్తర శతనామావళిని ఉచ్చరిస్తూ ప్రతినామము పలికినపుడూ హవ్యములు 118 సార్లు హోమ గుండము లో వేయాలి. ఆ తరువాత శ్రీ సూక్త మంత్రాలతో హోమాన్ని చేయాలి. శ్రీ సూక్తములో ఇరవై ఒక్క బుక్కులు ఉంటాయి. ఒక్కొక్క బుక్కును పలుకుచూ హోమ ద్రవ్యాలను గుండము లో వేస్తూ ఇరవై ఒక్క సార్లు చేయాలి.

రెండవ రోజున కూడ మొదటరోజు వలెనే చేయాలి.

మూడవ రోజున 102 సార్లుమూల మంత్రాన్ని పలుకుచూ, పలికిన ప్రతిదపా 'స్వాహా' అన్నపుడల్లా హోమ ద్రవ్యాలను అగ్నిలో వేస్తూ చేసి, పిదప శ్రీ వాసవీ సహస్ర నామావళితో యీ యజ్ఞమును చేయాలి. సహస్రము అంటే వెయ్యి. అంటే శ్రీ వాసవీదేవి నామములను వెయ్యి సార్లు ఉచ్చరిస్తూ, ఉచ్చరించిన ప్రతి దపా హవ్యములను హోమ గుండములో వేయాలి. ఆ తరువాత శ్రీ సూక్తమంత్రాల తో గత రెండు దినాలలో చేసిన విధముగానే ఇరవై బుక్కులను పలుకుచూ హోమ మును చేయాలి. తదనంతరము పూర్ణా హుతి చేసి, శాంతి పాఠాన్ని పఠించాలి. ఇంతటితో ఈ యజ్ఞ కార్యక్రమము ముగుస్తుంది.

యజ్ఞ విధానము తెలిసిన బ్రాహ్మణులు యజ్ఞాన్ని చేస్తారు. అయితే మూల మంత్రము - నామములు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవికి సంబంధించినవిగా ఉండడమే ఇందలి విశేషము. ఏయజ్ఞాని కైనా విధానము ఒక్కటే. మూల మంత్రా లు, నామములే మారుతూ ఉంటాయి.

102 హోమ గుండములతో 102 మంది వైశ్య దంపతులతో చేయిస్తే అది ద్వ్యుత్తరశత(102) శ్రీ వాసవీ హోమము అవుతుంది.

# నేను, నాదేశం

( గత సంచిక తరువాయి )

## డిటెన్షన్

1939-40లో బ్రిటీషు అడ్వైజర్ల పరిపాలన కాలంలో సింప్సన్ కంపెనీ కార్మిక సంఘానికి నేను అధ్యక్షుడుగా వున్నాను. దానిలో 1500 మంది కార్మికులు సభ్యులుగా వున్నారు. యుద్ధానికి అవసరమైన యంత్రాలు, మరలు, లారీలు వగైరాల పనులు ఆ కంపెనీలో జరుగుతుండేవి. బ్రిటీష్ గవర్నమెంటుకు చిక్కులు కలుగు జేయాలనే ఉద్దేశ్యం యుద్ధారంభంలోనే మాకు కలిగింది. అందువల్ల ఆ ఫ్యాక్టరీలో సమ్మె చేయించాము. ఆ సందర్భంలో నన్ను అరెస్టుచేసి వెల్లూరు జెయిలులో డిటెయిన్ చేశారు.

లోగడ 20 సంవత్సరాల క్రితం ప్రథమ ప్రపంచయుద్ధకాలంలో 4 సంవత్సరముల ఆరు మాసాలు నీడు జైళ్ళ జీవితం గడిచింది. మద్రాసు రాష్ట్రం అంతటిలోను అప్పట్లో రాజకీయ ఖైదీని నే నొక్కడినే. 20 సంవత్సరాలలో ఎంత మార్పువచ్చింది; నా లాంటివారు వందలు, వేలు జైళ్ళకు అలవాటు పడ్డారు.

ఈసారి ఎన్ని సంవత్సరాలు జైల్లో వుండాలో కాలనిర్ణయం లేదు. బయటవుండి స్వరాజ్యం కోసం ఏమీ చెయ్యజాలక పోయినందుకు అసంతృప్తి, అశాంతి కలిగాయి.

అయితే, కాంగ్రెసు నాయకులతోను, కమ్యూనిస్టు నాయకులతోను కలిసి వుండ వచ్చు; వారి రాజకీయాల్లోని భేదాలు, గాంధీ వాదానికి, కమ్యూనిజానికీ గల వ్యత్యాసము విపులంగా తెలుసుకోవచ్చు. వారి వారి సిద్ధాంతాలకు, చేతలకూ ఎంత సంబంధమున్నదో తెలుసుకోవచ్చు; నా జీవితంలో మిగిలిన కొద్ది సంవత్సరాలు దేశ సేవకు అర్పించి, చిన్నప్పటినుండి నాకు ఆశయంగా వున్న సంపూర్ణస్వరాజ్య సంపాదనకొరకు కృషి చేయవచ్చునని భావించాను.

ఇప్పటికే షుమారు 15 మంది డెటిన్యూలు వెల్లూరు జైలులో ప్రత్యేకంగా ఒక వార్డులో ఉన్నారు. కమ్యూనిస్టులు పదిమంది. ఫార్వర్డు బ్లాకువారు ముగ్గురు, అఖిలభారత ఖాక్సార్ నాయకుడు అల్లా మామష్రికీ ఒకరు, ఏ పార్టీకి చెందని భయంకారాచారిగారు ఒకరు వున్నారు.

మొట్టమొదట జైలులో ప్రవేశించిన ఘాటేగారు చేయించవలసిన సౌకర్యాలన్నీ చేయించారు. మేము నిర్దోషులము, మా మీద కేసులు పెట్టడానికి ఆధారం లేదు; ఇకమీదట హాని చెయ్యకుండా మాత్రమే జైలులో బంధించి వుంచారు. బయట

మా జీవితాలు ఎలావుండేవో అలాగే జైలులో వుండవచ్చునని బ్రిటిష్ ప్రభుత్వంతరపున రూథర్‌ఫర్డు దొర అంగీకరించారు. అందువల్ల ప్రభుత్వం వారు భోజనానికి సుఖమైన వసతు లేర్పరిచారు. ఒక్కొక్కరికి ఒక మంచం, రెండు కుర్చీలు, ఒక బీరువా మొదలైనవి యిచ్చారు. వార్తాపత్రికలు, పుస్తకాలు, బట్టలు, మందులు వగైరా ఏమీ కావలసి వచ్చినా మా స్వంత డబ్బుతో కొనుక్కోవచ్చు. టెన్నీసుకు ఏర్పాటు చేశారు. మా యిష్టం వచ్చినన్ని ఉత్తరాలు తెప్పించుకోవచ్చు, వ్రాసుకోవచ్చు. వంట, వంట పనులకు, బట్టలు ఉతుకుటకు నౌకర్లను యిచ్చారు. అంతేకాదు; మా కుటుంబాలకు ధారాళంగా అలవెన్సులు కూడా యిచ్చారు. ఆరంభదశలో ప్రభుత్వం సవ్యంగానే ప్రవర్తించింది. డెటిన్యూ లందరికి ఒక కమ్యూను అనే సంఘం పెట్టుకున్నాము. దానికి ఒక మేయర్‌ను, నిర్వాహక కమిటీని ఎన్ను కుంటూ వచ్చాము. మా అందరి తరపున మేయరుగారు ఒక్కరే సూపరెన్టెంటుతో మాట్లాడి, మా సమస్య లన్నిటినీ పరిష్కరించాలి. ఒక హాస్టలు మాదిరిగా వుండేది. ఘాటేగారు ఇవన్నీ చేయించినా బోనులో వున్నట్టు మాకు విసుగు పుట్టేది.

చదువులు, రాజకీయ గ్రంథ పఠనము, క్రొత్త భాషలను నేర్చుకోవడం, డ్రిల్లు మొదలయిన కార్యక్రమాలను ప్రారంభించాము.

క్రమంగా ఎక్కువమంది డెటిన్యూలు రాసాగారు. కార్మిక, కర్షక సంఘాల నాయకులు, అటుతరువాత విద్యార్థి సంఘాలవారు, కాంగ్రెస్ సత్యాగ్రహ నాయకులు, చివరకు రంగా మొదలైనవారు వచ్చారు. ఆరునెలలలో మా సంఖ్య 200 లకు పెరిగింది.

సంఖ్య పెరగడంతో ప్రారంభంలో ఒప్పుకొన్న సౌకర్యాలను అందరికీ అన్వయించ కూడదని రెండు క్లాసులుగా విభజించుటకు ప్రభుత్వం ప్రయత్నించింది. మా సంఖ్య పెరగడంతో మా బలంకూడ పెరిగింది. సర్కారుతో పోరాడి, వారి ఆటలు, అన్యాయాలు కట్టిపెట్టించడం ఒక విధిగా ఏర్పడింది. దీనితో మరొక భావంకూడా ఏర్పడింది. భావికాలంలో సర్కారుతో పోట్లాడి, స్వరాజ్యం సంపాదించ టానికి సిద్ధంకావలె ననే ఆలోచన ప్రతి పార్టీకి కలిగినది. అయితే యీ రెండు విషయాల్లో ఒక్కొక్క దృక్పథంలో పనిచేస్తూ, తమ తమ పార్టీలను బలపరచుకోటానికి ప్రయత్నించుతూ, వారిలో వారు పోటీలు పడుతుండేవారు.

రెండు వందలమంది డెటిన్యూలలో పదిమంది మాత్రమే కమ్యూనిస్టులు; 185 మంది కాంగ్రెస్ సభ్యులు. ఇతరులు ఐదు గురు. రెండు సంవత్సరాలకు కమ్యూనిస్టుల సంఖ్య సుమారు 165 మందికి పెరిగిపోయింది.

## జైలులో కమ్యూనిస్టుల కార్యక్రమం

కాంగ్రెసు నాయకులు రాజకీయ గ్రంథాలను చదువరు; తర్కించాల్సిన

విషయాలుకూడా వారికి లేవు. స్వరాజ్యం వస్తుందనీ, తప్పక వస్తుందనీ యోచనలు, ప్లానులు గాంధీగారికే వదిలిపెట్టుట మంచిదనీ వారి అభిప్రాయం. కమ్యూనిస్టులు క్లాసులు పెట్టుకొని, రాజకీయాలను చక్కగా చదువుతూ, చర్చించుకుంటూండేవారు. దినమంతా ఏదో ఒక ప్లాను ప్రకారం జైలును రాజకీయ విశ్వవిద్యాలయంగా మార్చారు.

కమ్యూనిస్టులలో ఒక పెద్ద ఆవేదన ఉండేది. యుద్ధకాలం గడిచిపోతోందనీ, స్వరాజ్యం సంపాదనకు మంచి అనుకూల సమయం చేయి జారిపోతున్నదనీ వారి విచారము. ఇతర దేశాలకు స్వరాజ్య మెలాలభించింది? ఇండియాకు రాక పోవడానికి కారణమేమిటి? ఎలాంటి పంథా, ఎలాంటి కార్యక్రమం ఉండాలనేవి చర్చించే వారు.

జమీందారీ తత్వము, సామ్రాజ్య తత్వము, ఫాసిజము, టెర్రరిజం, సోషలిజము, కమ్యూనిజము మొదలయిన వాటి స్వరూపాలు యెలాంటివి? వాటిలోని వ్యత్యాసాలు ఏమిటి? అనే విషయాలను చదువుతుండేవారు.

కార్మిక, కర్షకుల సహాయం లేకుండా స్వరాజ్యం వస్తుందా? వారిని వర్గాలుగా సంఘటిత పరిస్తే వచ్చే మంచిచెడ్డలు ఏమిటి? వర్గపోరాటం జరుపవచ్చునా? సామ్రాజ్యవాదులతో తప్పకుండా కలిసిపోయి, స్వరాజ్యం రాకుండా అడ్డుపడే వర్గాలేవి? విప్లవాన్ని కోరే వర్గాలేవి?

ఫాసిజం గెలిస్తే మనకు స్వరాజ్యం వస్తుందా? లేక సోషలిజం గెలిస్తే వస్తుందా? దౌర్జన్యం ఉపయోగించకూడదా? ఏ పరిస్థితుల్లో ఉపయోగించవచ్చు? మన పరమావధి స్వరాజ్యమా, అహింసా వాదమా? అహింసవల్ల స్వరాజ్యం తప్పకుండా వస్తుందా?

అలాంటి విషయాలమీద శాస్త్ర చర్చ, గ్రంథ పఠనము జరుగుతూండేవి. డెటిన్యూలలో చాలమందికీ, అన్ని పార్టీలవారికి నచ్చుచుండిన యీ చర్చలు నాయకులలో కొందరికి మాత్రమే నచ్చలేదు.

ఇలాంటి ప్రయత్నాల మూలంగా కమ్యూనిస్టులు ఇతరులను మార్చుతూ, తమ సంఖ్యను పెంచుకుంటూ వచ్చారు. కమ్యూనిస్టులతో చేరవద్దని, వారి క్లాసులకు వెళ్ళవద్దని, వారితో చర్చించవద్దని, వారితో కలసి ఏ పనీ చెయ్యవద్దని కాంగ్రెసు నాయకులు శ్రీ పట్టాభి, కాళేశ్వరరావు, కళా వెంకట్రావుగార్లు చెప్పుచుండేరేగాని, తాము వేరే క్లాసులుగాని, చర్చలుగాని ఏర్పాటు చెయ్యలేదు. వారి సంఖ్య దిన దినమూ క్షీణింపసాగింది.

## ఆచార్యత్వానికి రంగా నిరాకరణ

ప్రొఫెసరు రంగాగారు జైలుకు రాగానే చాలామంది యువకులకు ఉత్సాహం కలిగింది. ఆచార్య రంగావద్ద ఎన్నో విషయాలు నేర్చుకోవచ్చునని అనుకొన్నారు. కారల్ మార్క్స్ వ్రాసిన "కాపిటల్" (పెట్టుబడి) అనే ఆర్థిక రాజకీయ గ్రంథాన్ని బోధించమని

కొందరు రంగాగారిని ప్రార్థించారు. రంగాగారు సమ్మతించలేదు. కారల్ మార్క్సుగారి కొన్నిఅభిప్రాయాలతో తాను ఏకీభవించడంలేదని వారి ఆక్షేపణ. 'మరీమంచిది. మీ ఇద్దరి అభిప్రాయాలు మాకు తెలుస్తవి. తప్పక మీరే క్లాసు తీసుకోవాలని ఎంతో బతిమిలాడిరి. కాని, రంగాగారు అంగీకరించలేదు; రంగాగారు ఇంతగా ఎందుకు సంకోచించాలి? అని అందరికీ ఆశ్చర్యం. ఆయనను అడిగిన వారు కమ్యూనిస్టులా? కాదు. కార్మిక సంఘాలలో పనిచేయుచుండిన కాంగ్రెసు వాదులు, యువకులు, జైళ్ళకు వెళ్ళినవారు. డాక్టరు పట్టాభిగారు జెయిలుకు రాగానే రాజకీయ విషయాలలో జెయిలులో ఉన్నంతకాలం జోక్యం కలుగజేసుకోనని ఖచ్చితంగా చెప్పేశారు. మరి క్లాసులు తీసుకోగలవారు కాంగ్రెసు నాయకులలో లేరు.

## డాక్టరు కె.బి.కృష్ణ

అటు తరువాత డాక్టరు కె.బి.కృష్ణ గారు జైలుకు వచ్చారు. వారు మాకు క్రొత్త. వారిని గురించి వివరాలు తెలియవు. రాజకీయ శాస్త్రంలో గొప్ప పండితుడని మాత్రం వినివున్నాం. యువకులు "ది కాపిటల్" గ్రంథాన్ని బోధించమన్నారు. "మీయంతట మీరే నేర్చుకొనవచ్చునే; కష్టంలేదే" అని వారు అంటే అందరికీ ఆశ్చర్యం కలిగింది. బోధించడానికి ఒప్పుకొని మరునాడే క్లాసు ప్రారంభించారు. ఎంతో సులభంగా బోధించారు. ఆయన శక్తి మాకు ఆశ్చర్యంగా వుంది. ఆచార్య రంగాగారుకూడ విద్యార్థిగా చేరాడు. అంతేకాదు; కాంగ్రెసు నాయకులు చాలామంది చేరారు. అయితే పట్టాభి మొదలైన నాయకులు వారిని వెళ్ళకూడదని నివారించారు. కృష్ణగారు "ఇండియాలో మైనార్టీల చరిత్ర" (The History of the minorities in India) అనే గ్రంథాన్ని వ్రాసినవారు. ఆయన రాజకీయ, ఆర్థిక శాస్త్రాలలో పారంగతుడు; వేదాంత శాస్త్రంలో అసమాన పాండిత్యం కలవాడు. చరిత్ర పఠనలో ఆరితేరిన వాడు. ఆయనది చాల నిశితమైన బుద్ధి. ఏ విషయాన్నైనా శాస్త్రీయంగా యోచించి పరిష్కరించ గల మేధావి. వారి సహాయంతో డెటిన్యూల క్యాంపు ఒక సర్వకళాశాలగాను, విప్లవ కళాశాలగాను మారింది.

సంఘం ఒక వ్యవస్థనుండి మరొక వ్యవస్థకు మారుతూ అభివృద్ధి చెందుతున్నట్టు మార్క్సు సిద్ధాంతాల ప్రకారమే కలుగుచున్నట్టు బోధించారు. అలాగైతే వేదాంతంలో కూడ యిలాగే మార్పులు కలుగుతున్నాయని మార్క్సు సిద్ధాంతాల ప్రకారం వృద్ధికి వచ్చుచున్నట్టు నిరూపించమని నేను కోరాను. జైలులో ముఖ్య గ్రంథాలు లభించక పోయినా క్లాసులుపెట్టి చర్చలు ఏర్పాటు చేసి, అనేక విషయాలు బోధించుతూండే వారు. ఎన్నో నెలలు ఈ క్లాసులు జరిగాయి. ఆచార్య రంగాగారు కూడా ఆ క్లాసులకు వచ్చుచునే వుండిరి.

(ఇంకా ఉంది)

# ఇదీ సమాఖ్య కృషి

సభాధ్యక్షులకూ, వేదికను అలంకరించిన పెద్దలకూ నా వందనాలు. ఈ సభలో కొలువు తీరిన మీ యెల్లరకూ నా ప్రణామాలు.

ఈ సమాఖ్యను శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవాలయాలు, ఆర్య వైశ్య ధర్మ సంస్థల సమాఖ్య, ఆంధ్ర ప్రదేశ్ అను పేర 1989 సెప్టెంబరు నెల 23వ తేదీన ఇదే విజయవాడ పట్టణములో శ్రీ కన్యకాపరమేశ్వరీ అన్నసత్రములో సదరు అన్న సత్రపరిపాలకుల సహకార, ప్రోత్సాహాలతో ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య యువజన సంఘాల సమాఖ్య కృషి ప్రయత్నములతో ఏర్పాటైంది. కడప డిస్ట్రిక్టు రిజిస్ట్రార్ గారి ఆఫీసులో 67/1990 నెంబరు గలదిగా రిజిష్టరు కూడ అయింది.

"చుట్టూ గాఢంగా ఉన్న చీకటిని చూస్తూ తిట్టుకుంటూ కూర్చోవడంకన్నా ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించి సాధ్యమైనంత చీకటిని పారద్రోలాలి" అన్నదే ఈ సమాఖ్య ఏర్పాటుకు ఊపిరి.

మన ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రములో రెండు వందలకు పైగా ఉన్న శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవాలయాల, ఒక వందకు పైబడి ఉన్న ఆర్య వైశ్య ధర్మసంస్థల స్వతంత్ర ప్రతిపత్తిని సంరక్షించు కోవడమూ,

పై వాటన్నింటి మధ్య చక్కని సంబంధాన్నీ, సముచిత అవగాహననూ కలిగించడము,

మాతృశ్రీ వాసవీదేవి బింబము, మంత్రము, యంత్రము, ఆరాధనా విధానమూ రాష్ట్ర మంతటా ఒకేరీతిగా ఉండుటకు తగిన కార్యక్రమాన్ని చేపట్టడము - మొదలగునవి ఈ సమాఖ్యను ఏర్పాటు చేయుటలోని ముఖ్య ఉద్దేశ్యాలు.

మన భారత రాజ్యాంగ శాసనములోని 26 (సి) సూత్రము మేరకు, మన మాతృశ్రీ వాసవి ఆలయాలు డినామినేషన్ టెంపుల్స్, ఆర్య వైశ్య ధర్మ సంస్థలు డినామినేషన్ ఇన్‌స్టిట్యూషన్స్ - వీటి విషయములో ప్రభుత్వాధికారులు జోక్యము చేసుకోరాదు. అధికారులకు జోక్యము కలుగుటకు వీలుగా ప్రభుత్వం శాసనాలు చేయరాదు. కాంట్రిబ్యూషన్లు చెల్లించమని అడుగరాదు. ధర్మ కర్తలను నియమించరాదు అని యీ నాడు మనమంతా ధైర్యంగా చెప్పుకొనే అవకాశం కలిగింది ఈ సమాఖ్య కృషివల్లనే. ఇందుకు భీమవరం వాస్తవ్యులు, ప్రముఖ న్యాయవాదులు శ్రీ తమ్మన వెంకటరత్నం, నంద్యాల వాస్తవ్యులు, న్యాయవాదులు శ్రీ సి.వి. సత్యనారాయణ శ్రేష్ఠి గారలు యీ సమాఖ్య ద్వారా కృషి చేశారు. హైదరాబాదు వాస్తవ్యులు, ప్రసిద్ధ న్యాయవాదులు శ్రీ నంబూరి రామమోహన రావు గారలు వారికి సహకరించారు. ఈ ముగ్గురికీ ధన్యవాదాలు.

ఈ 26 (సి) సూత్రము క్రిందనే ధర్మ కర్తల నియామకపు టుత్తర్వులపై న్యాయ స్థానాలలో దావా వేసి రాజంపేట, నర్సరావుపేట, సికింద్రాబాద్ ఆవులమందలోని శ్రీ వాసవి దేవాలయాలకు నిలుపుదల (స్టే) ఉత్తర్వును పొంది ఉన్నాము.

సికింద్రాబాద్, ఆవులమేరిదలోని శ్రీ వాసవీ ఆలయానికి జరిగిన కార్యనిర్వాహక అధికారి నియామకాన్ని రద్దు చేయించ గలిగేము. ఇందుకు మన నాయకులు, పూజ్యులు శ్రీ రోశయ్య గారలు అమాత్యులుగా ఆనాటి తమ అధికారాన్ని ఉపయోగించి సహకరించారు. వారికి నా కృతజ్ఞతలు.

మన మాతృశ్రీ వాసవీదేవికి బింబము, మంత్రము, యంత్రము, ఆరాధనా విధానము శాస్త్ర సమ్మతంగా రూపొందించి, ప్రకటించిన ఆంధ్ర ప్రదేశ్ ఆర్య వైశ్యమహాసభవారి అధికారిక నిర్ణయాన్నే స్వీకరించి, ఆ విధానాన్ని రాష్ట్ర మంతటా పాటించునట్లుగా కృషి చేస్తున్నాం.

శ్రీ వాసవీ సుప్రభాతము, శతోత్తర సహస్ర నామములను తీయని కంఠముతో పాడించి, కమ్మని సంగీతముతో మేళవించి అధికారిక కేసెట్లుగా రూపొందించినాము. ప్రతి వైశ్యుడూ తమ నిత్య కృత్యాన్ని మాతృశ్రీ వాసవీదేవి సుప్రభాత శ్రవణము తోనూ, సహస్ర నామముల సంస్మరణ తోనూ అనుదినమూ ఆరంభించా లన్నది ఈ కేసెట్లను తయారు చేయించడంలోని ఉద్దేశ్యము. ఈ కేసెట్లను మరి కొంత సేపట్లో పూజ్యులూ, ఈ నాటి ఈ సభకు ముఖ్య అతిథులూ అయిన శ్రీ రోశయ్యగారు తమ కర కమలములతో విడుదల చేస్తారు. విడుదల అనంతరము ఈ కెసెట్లను మీరు కొనుటకు వీలుగా ఈ మందిర ప్రాంగణములోనే ఉంచాము. కేసెట్టు చిల్లరధర రూ.30/-లు ఒకేదపా వంద కేసెట్లు కొంటే రూ.2,500/-లకే ఇస్తారు.

శ్రీ వాసవీ ఆరాధన, బింబము, మంత్రము, యంత్రము, యజ్ఞము, వ్రతము, సహస్రనామములు మొదలగు సర్వ విషయాలతో కూడిన వాసవీ సర్వస్వముద్రణ, ప్రామాణిక ప్రతి ప్రకటన, శ్రీ వాసవీ ఆలయనిర్మాణ నమూనా మొదలగునవి ఈ సమాఖ్య భవిష్యత్ కార్యక్రమాలు.

శ్రీ వాసవీ సర్వస్వం విషయములో పూర్తి విషయ సేకరణ జరిగింది. ఆర్థిక లోపంవల్ల ప్రచురణను ప్రారంభించలేదు. ఇరవై వేలకు పై బడి వ్యయమగునని అంచనా.

ప్రామాణిక ప్రతికి తుదిరూపాన్ని ఇచ్చాము. ముద్రణ మాత్రమే కొదవ.

భారతదేశ స్వాతంత్ర్యానికి విప్లవ పంథాలో ఉద్యమాన్ని నడిపిన శ్రీ దర్శి చంచయ్య గుప్త గారి పేర ప్రతి యేటా ఆయన సంస్మరణార్థము ఒక అవార్డును ఇవ్వాలని ఈ సమాఖ్య నిర్ణయించింది. ఆ నిర్ణయము ఫలితంగానే మన యీ సమాఖ్య అధ్యక్షులు, 'ప్రజాబంధు' 'దానశీల' శ్రీ కామిశెట్టి సుబ్బరావుగారు మరి కొద్ది సేపట్లో స్వాతంత్ర్య సమర యోధులు శ్రీ కె.సి. గుప్త గారికి దర్శి చంచయ్య గుప్త అవార్డును ఇస్తారు.

ఈ అవార్డుకు విరాళం కూడ శ్రీ సుబ్బరావు గారు తమ శ్రీ కామిశెట్టి సుబ్బరావు శ్రీమతి చెన్నమ్మ ట్రస్టు తరపున ఇచ్చి సహకరించారు. వారికి యీ సమాఖ్య తరపున ధన్యవాదాలు సమర్పిస్తున్నాను. ప్రతియేడూ ఈ అవార్డును ఒక స్వాతంత్ర్య సమర యోధునికి ఇవ్వాలని నిర్ణయము. ఇందుకు రూ.1,500/-లు విరాళంగా ఈ సమాఖ్య తీసుకొంటుంది. ఈ సభలో

ఉన్న వదాన్య శేఖరులు ఎవరైనా ముందుకు వచ్చి తమ సంసిద్ధతను తెలియజేస్తే వారి పేర మరు సంవత్సరం ఇస్తాము. ఒకరుకాక ఇర్వురు దాతలు లభిస్తే రెండు అవార్డులను ఇస్తాము. ఎందుకంటే దర్శి చెంచయ్య గుప్తగారు చక్కని రచయిత. భారతదేశములో మొట్ట మొదటి వ్యవసాయ పట్టభద్రులు కూడ. అందువల్ల ఆ రెండవ అవార్డును, సాహిత్య పరిశ్రమ చేసిన ఒక వైశ్య సోదరునికి ఇస్తాము.

రాష్ట్రములోని వివిధ విశ్వవిద్యాలయాలలో స్నాతక స్నాతకోత్తర పరీక్షల్లో సర్వ ప్రథములుగానో, అత్యధిక మార్కులను సంపాదించిన వారుగానో కృతార్థులైన వైశ్య విద్యార్థినీ విద్యార్థులకు స్వర్ణ పతకాలను ఇవ్వాలనికూడ ఆలోచిస్తున్నాం. స్వర్ణ పతకమునకు విలువ రూ.1,000/–లుగా నిర్ణయించారు. రూ.1,000/–లు ఇచ్చిన దాత వారి పేరుమీద వారి కర కమలాలతో స్వర్ణపతకాన్ని బహుకరించ వచ్చు.

ఈ విషయములో ఆసక్తి కలిగిన వదాన్యులు ఈ సభలో ఉంటే వారి సంసిద్ధతను తెలియజేయ గోరుచున్నాను. ప్రతిభావంతులైన వైశ్య విద్యార్థినీ, విద్యార్థులను సముచితంగా సత్కరించి వారి ప్రతిభకు గుర్తింపును ఆపాదించు రాష్ట్ర స్థాయి వైశ్య సంస్థ ఇప్పుడు రాష్ట్రములో ఏదీ లేదు అను విషయం మీకు తెలును.

సర్వ శ్రేయోనిధిని ఏర్పాటు చేయాలన్నది కూడ ఈ సమాఖ్య ఉద్దేశ్యాలలో ఒకటి. నిర్వహణా లోపం వల్ల కుంటుపడుచున్న శ్రీ వాసవి దేవాలయాల చిన్న, చిన్న మరమ్మత్తులకూ, అర్చనాదికాలు సజావుగా జరుగుటకూ ఆ నిధికి ప్రోగైన ధనాన్ని ఉపయోగించాలన్నది ఇందలి అభిప్రాయం. ఈ సమాఖ్య సభ్యత్వము రాష్ట్రములోని శ్రీవాసవీదేవాలయాలకూ, ఆర్య వైశ్యధర్మసంస్థలకూ మాత్రమే పరిమితం. ఈ సమాఖ్య ఆశయాలను, కృషినీ గుర్తించి సహకరించాలన్న అభిప్రాయము గలిగిన ఉదార హృదయులు తమ ఇచ్ఛానుసారము ఈ సర్వ శ్రేయోనిధికి విరాళాలు ఇవ్వవచ్చు. ఇంతే ఇవ్వాలి అన్న పరిమితిలేదు.

సుప్రీం కోర్టులో పెండింగులో ఉన్న చిత్తూరు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవాలయము, ఈ విజయవాడ శ్రీ కన్యకా పరమేశ్వరీ అన్నసత్రముల వ్యవహారాన్ని కూడ ఈ సమాఖ్య జాగ్రత్తగా గమనిస్తూ ఉంది. ఈ సమాఖ్య న్యాయవాదులు శ్రీ తమ్మన వెంకటరత్నం గారు ఢిల్లీకి వెళ్ళి ఈ కేసులను చూస్తున్న న్యాయవాదితో చర్చించి కూడ వచ్చారు.

నాయీ నివేదికను ఆసక్తితో విన్న మీ అందరికీ మరోసారి నా సుమాంజలులు. సభాధ్యక్షులకూ, వేదిక మీద ఉన్న ఇతర పెద్దలకూ మరోసారి నా పుష్పాంజలులు. ఇక సెలవు.

---

13.2.95వ తేదీన విజయవాడలో జరిగిన శ్రీవాసవీ కన్యకాపరమేశ్వరీ దేవాలయాలు, ఆర్య వైశ్యధర్మ సంస్థల సమాఖ్య ఆంధ్రప్రదేశ్, కేసెట్ విడుదల, దర్శి చెంచయ్య గుప్త అవార్డు, శాసనసభ్యుల సన్మానం, బిరుదప్రదాన సభలో పై సమాఖ్య కార్యదర్శి శ్రీ పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి గారు చేసిన ప్రసంగ పాఠం.

## ప్రతి వైశ్యుని ఇంట్లో ఉండవలసిన కేసెట్

తమ కులదేవత శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవికి, అధికారికమైన సుప్రభాతము, సహస్ర నామములు గల కేసెట్ లేని లోటును గుర్తించిన కడప ప్రధాన కార్య స్థానంగా గల శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్య వైశ్య ధర్మ సంస్థల సమాఖ్య, ఆంధ్ర ప్రదేశ్ వారు కమ్మని సంగీతముతో, మధురమైన కంఠముతో తయారు చేయించిన కేసెట్ "అధికారిక శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ సుప్రభాత, సహస్రోత్తర నామావళి". ప్రతివైశ్యుడూ తన ఇంట్లో తప్పక ఉంచుకొన వలసిన కేసెట్ ఇది. ప్రతి వైశ్యుడూ తన నిత్య కృత్యాన్ని తమకుల దేవత శ్రీ వాసవీ దేవి సుప్రభాత శ్రవణముతోనూ, సహస్రోత్తర నామముల సంస్మరణతోనూ ప్రారంభించాలి, అన్న మాహోన్నత ధ్యేయముతో ఈ సమాఖ్య వారు ఈ కేసెట్‌ను తయారు చేయించారు. మాజీ మంత్రి వర్యులు శ్రీ కె. రోశయ్య గారు 13.2.1995వ తేదీన విజయవాడలో, ఇందు కొఱకై ఏర్పాటైన కార్యక్రమములో, ఈ కేసెట్‌ను విడుదల చేశారు. చిల్లర ధర రూ.30/–లే. ఒక కేసెట్ మాత్రమే కావాలనుకొన్న వారు తమ గ్రామము లేక పట్టణములోని శ్రీ వాసవీ దేవ్యాలయమునుండి పొందవచ్చు. 25గానీ అంతకు మించి గానీ కేసెట్లు కావలసిన వారు కేసెట్టుకు రూ.30/–ల చొప్పున, తగిన మొత్తము పంపిన, తపాలా ఖర్చులు భరించి, ఈ సమాఖ్య వారే పంపుతారు. వంద కానీ అంతకు పై బడి గానీ కావలసినవారు కేసెట్ 1కిరూ.25/-ల చొప్పున పంపితే తపాలా ఖర్చులకు కూడ సరిపోతుంది. ఉదారహృదయం గల వైశ్యసోదరులు ఎవరైనా రూ.2500/-లు పంపి కేసెట్‌లను తెప్పించుకొని తమ గ్రామము లేక పట్టణము లోని వైశ్య సోదరులకు అందిస్తే వారందరికీ తమకుల దేవత శ్రీ వాసవీ దేవి సుప్రభాత శ్రవణ, సహస్రోత్తర నామముల సంస్మరణ భాగ్యాన్ని కలిగించి అభినందనీయులౌతారు. రూపాయలను యం.ఓ. లేక డి.డి. ద్వారా శ్రీ పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి, ఎడిటర్, వైశ్య ప్రబోధినీ, జయనగర్ కాలని, కడప 516 002కు పంపాలి.

## చైతన్యానంద స్వామి గారి బ్రహ్మైక్యం

పూర్వాశ్రమములో చిలకల మాణిక్యాల రావుగా పిలువబడుచూ, సన్యసించి, చైతన్యానంద స్వామిగా తమ పేరును మార్చుకొన్న స్వామిగారు 31.12.1994వ తేదీన 7 గంటల 30 నిమిషములకు నర్సరావుపేటలో బ్రహ్మైక్యం చెందారు. స్వామి వారు సన్యసించిన తర్వాత కొంత కాలము హృషికేశ్ లోనూ మరి కొంత కాలము ఏర్పేడులోని వ్యాసాశ్రమములోనూ ఉండి మానసిక ఆనందాన్ని పొందారు. వీరు స్వర్గీయ శుద్ధ చైతన్య స్వామి గారి సోదరులు కూడ.

# వైశ్య ప్రబోధిని – క్యాలెండరు

( 1995 ఫిబ్రవరి 21 నుండి 1995 మార్చి 20 వరకు )

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదివారము | | 26 | 5 | 12 | 19 |
| సోమవారము | | 27 | 6 | 13 | 20 |
| మంగళవారము | 21 | 28 | 7 | 14 | |
| బుధవారము | 22 | మార్చి 1 | 8 | 15 | |
| గురువారము | 23 | 2 | 9 | 16 | |
| శుక్రవారము | 24 | 3 | 10 | 17 | |
| శనివారము | 25 | 4 | 11 | 18 | |

ఫిబ్రవరి 22 :– స్వామి దయానంద సరస్వతి జయంతి.

ఫిబ్రవరి 27 :– మహాశివరాత్రి.

ఫిబ్రవరి 28 :– షెడ్యూల్డు కామోడిటీస్ లైసెన్సును రెన్యూచేయమని కోరుచూ పంపవలసిన దరఖాస్తును పంపుటకు ఆఖరు తేది.

మార్చి 3 :– రంజాన్ పండుగ. దుకాణాలు–సంస్థలు, కర్మాగారాలు–సంస్థలలో పనిచేయు ఉద్యోగులకు జీతముతో కూడిన సెలవు దినము.

మార్చి 4 :– పూర్వాభాద్ర కార్తె రాక రాత్రి 2–46.

మార్చి 14 :– కామదహనం, మీన సంక్రాంతి.

మార్చి 15 :– చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు చెక్కుతోబాటు A-2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరి తారీఖు.

మార్చి 17 :– స్వామి అయ్యప్ప జయంతి.

మార్చి 18 :– ఉత్తరాభాద్ర కార్తె రాక ఉదయం 7–52.

మార్చి 20 :– A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరు రోజు.

**26, 5, 12, 19 ఆదివారాలు**

---

నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.

( రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్ )

టెలిగ్రాం అన్ని చోట్లా " VASAVI "
టెలిఫోన్ నెంబరు : మార్కాపురం : 2595, శ్రీశైలం : 3140, 3114, పుట్టపర్తి : 2040, తిరుమల : అప్లైడ్.

## వైశ్యయాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. వాసవీ సత్రం, శ్రీశైలం :– 128 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, 4 పెద్ద హాల్సు, పూర్తిగా తయారుచేసి 25-12-62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో ఒక లక్షయాభై వేల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1116.00 లు శాశ్వత సభ్యత్వం. ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.116/-లు చెల్లించిన వారికి సంవత్సరంనకు ఒకసారి ప్రసాదం పంపించబడును.

   రెండవ అంతస్తులో 37 రూములు కట్టుచున్నాము. 30×10 రూము రూ.30,000/-, 15×7 రూముకు రూ.20,000/- అగును. రూము విరాళంయిస్తే దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును.

2. వాసవీ నివాస్, పుట్టపర్తి : 2 ఎకరంల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 75 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చు చున్నాము. సాధ్యమైనంత త్వరలో పూర్తిగా అన్ని వసతులతో నిర్మాణం చేసి, నిత్య భోజనములు ఏర్పాటు చేయుటకు ప్రయత్నములు త్వరలో జరుగుచున్నవి. స్థాపకులు శాశ్వత సభ్యత్వం రూ.2116.00 వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.80,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. 10×25 రూమ్‌కు రూ.50,000 ఇచ్చిన యెడల దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 100 రోజులు రూము యివ్వబడును. మిగతా రోజులు

యాత్రీకులకు యివ్వబడును.

3. <u>వాసవీ భవన్, తిరుమల</u> : తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనపు పనులు చురుకుగా సాగుచున్నవి. రెండు హాల్సు 52×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) నిర్మాణములో కలవు. సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

**హాల్సు డోనార్సు :** 52×10 అడుగుల ఒక అంకణము హాలుకు లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు ఉచితంగా యివ్వబడును 20 అంకణములు పరిమితం.

**మహారాజ పోషకులు :** 400 మంది సభ్యులకు పరిమితము. పది వేల రూపాయల నొసగు దాతలకు సంవత్సరములో ఐదు రోజులు రూము యివ్వబడును. ఫోటో మరియు పేరు శిలాఫలకము వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును.

**రాజ పోషకులు :** 400 మంది సభ్యులకు పరిమితము. ఆరు వేల రూపాయల నొసగు దాతలకు సంవత్సరములో మూడు రోజులు రూము యివ్వబడును. నాపరాయిపైన పేరు వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును. "వాసవీ భవన్, తిరుమల"కు కార్యదర్శి కార్యాలయం, మార్కాపురం అని వ్రాసి ముందుగా పంపు వారి DD మాత్రమే ఆమోదించబడును. చెక్కులు పంపవచ్చును. కాని ఆ చెక్కులు చెల్లివచ్చినప్పుడే సీరియల్ లోకి వచ్చును. అవకాశము లేని వారి పైకము తిరిగి వాపసు పంపు అధికారం సంఘమునకు కలదు. DD లు మార్కాపురం, స్టేటు బ్యాంకు, వైశ్యా బ్యాంక్, సిండికేట్ బ్యాంక్ లపై పంపగోర్తాము. తిరుమల మేదరిమెట్ట ప్రాంతంలో మనము కట్టుచున్న సత్రం దగ్గర కట్టిన షెడ్డులో తాత్కాలిక కార్యాలయం ప్రారంభించినాము.

4. **వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టి ట్రస్టు, కొత్త వీధి, తిరుపతి.**

తిరుపతిలో మా సంఘం ద్వారా పై పేరుతో సత్రం కట్టుకొనుటకుగాను మద్రాసు ఉప్పుటూరు యతిరాజులచెట్టి ట్రస్టు వారు తిరుపతి కొత్తవీధిలో షుమారు 7 వేలు చ॥ అ॥ గల పాత భవనమును ఉచితంగా సమర్పించినారు. ఈ పాత భవనం పునః నిర్మాణము చేసి క్రింద భాగములో వైశ్యులు కళ్యాణంలు చేసుకొనుటకు గాని, యితర సమావేశములు, శుభకార్యములు చేసుకొనుటకు గాని తయారుచేస్తూ, మొదటి అంతస్తులో భోజనహాలు నిర్మాణం చేసి, నిత్య భోజనములు, రెండవ అంతస్తు నుండి వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రీకుల సౌకర్యార్థం చేయుటకు తీర్మానించినాము. అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళంలు సమర్పించకోర్తాము.

రూ.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. రూము సైజు 200 చ.అ. ఫోటో వేసి, నాపరాయి పైన వారి పేరు చెక్కించబడును.

రూ.10000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. ఫోటో వేసి నాపరాయి పైన పేరు చెక్కించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.5000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.2116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి ఫోటో మరియు బోర్డు వేయబడును.

రూ.1116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి పేరు నాపరాయిపై చెక్కించబడును.

5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థి విధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూల ధనం ఏర్పాటు చేసి అందులకు రాబడు వడ్డీని నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారుగదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైన మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్షరూపాయలు సమర్పించిన వారి ఫోటో నాలుగు సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన నాలుగు సత్రములలో వ్రాయబడును. వీరికి

వంశపారంపర్య సభ్యత్వం కలదు. వీరికి సంవత్సరములో 25 రోజులు ప్రకారం అన్ని సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116.00 సమర్పించినవారు మహారాజ పోషకులు. యీ సంఘమున వంశపారంపర్య సభ్యులు. వీరి ఫోటో మన సంఘము నిర్వహించు అన్ని సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా అన్ని సత్రములలో నాపరాయి పైన చెక్కించబడును.

రు.5116.00 సమర్పించిన రాజపోషకులు. వీరికి వంశ పారంపర్యంతం సభ్యత్వం కలదు. వీరి ఫోటో-దాత కోరిన మన సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116.00 సమర్పించిన వారు పోషకులు. వీరికి వంశపారంపర్య సభ్యత్వం. వీరి ఫోటో దాత కోరిన ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయి పైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116.00 సమర్పించిన వారు సభ్యులు. వీరికి వంశ పారంపర్య సభ్యత్వం కలదు. వీరి పేరు దాత కోరిన ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ పంపకం కమిటీ తీర్మానం ప్రకారం నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

M.Tech., ప్యాసు అయిన వారికి యీ సంవత్సరము రు.3500/-ల ప్రకారం ముగ్గురికి యివ్వబడును.

6. వాసవీ అష్టోత్తర శతహోమకుండ వార్షిక మహా క్రతువు రాబోవు 1995లో స్వామి అనుగ్రహం మేరకు పుట్టపర్తిలో పెట్టుటకు ఏర్పాట్లు చేయుచున్నాము.

—: ప్రత్యేక ఉత్తర ప్రత్యుత్తరములకు :—

మూర్తి వెంకటేశ్వర్లు, వాసవీ సత్రముల కార్యదర్శి కార్యాలయం,

మార్కాపురం - 523 316. ప్రకాశం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్.

అధ్యక్షులు : ఆత్మకూరు నాగభూషణం శ్రేష్ఠి, నంద్యాల.

**N.B :-** పై సత్రముల పేరుతో - D.D. లు కాని, చెక్కులుకాని పంపకోర్తాము. ఎవరు అడిగినను డబ్బు యివ్వవద్దు. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

## జీవితం

రచన : 'కవిరత్న' చింతల శ్రీనివాస్
ఎం.ఏ., యల్.యల్.బి.,

నిప్పులు కక్కే అగ్నిశిఖకాదు జీవితం.
కరిమబ్బులవిప్పే ప్రేమవర్షాన్ని కురిపించే
సౌందర్యక్షేత్రం జీవితం.
లేనిపోని ఆశల పేరాశల శిలా శకలం కాదు
జీవితం.
నిండుపున్నములు వెలిగే, ఆచరన
మంజీరాలు పలికే, వెన్నెల నిలయం
జీవితం.
రంగులు వెలసే, రాగాలు విరిచే, నిరాశా
ప్రస్థానం కాదు జీవితం.
అనురాగంపూచే అనుబంధంనిలిచే
నిజవెన్నెల ఆశాసౌధం జీవితం.
కలలు పండని, కాంతి నిండని రాతి
బండకాదు జీవితం.
కళా ఉషస్సులు నిండే, మహోతపస్సులు
ఫలించే చైతన్య రథం జీవితం.
జీవితంగెలుపు, ఓటముల క్రీనీడ. వెలుగు
నీడల మేలి కలయిక.
కావాలి నిత్యకాంతుల ప్రకాశగీతం జీవితం.
ఎగరాలి సుఖ శాంతుల కేతనం.

## క్రొత్త మాధవరంలో సాయీ ప్రతిష్ఠ

కడప జిల్లా క్రొత్త మాదవరంలోని సాయీ నగర్ లో 9.2.1995వ తేదీన "శ్రీ షిరిడీ సాయిబాబా" ప్రతిష్ఠ జరిగింది. గుడి నిర్మాణమునకూ, ప్రతిష్ఠా కార్యక్రమానికి కావలసిన మెత్తం ధనాన్ని పూర్తిగా కడపలోని ప్రముఖ వస్త్ర వ్యాపారులు శ్రీ ఎ. వెంకటసుబ్బయ్య వారి కుటుంబ సభ్యులే విరాళంగా ఇచ్చారు.

## కృష్ణాజిల్లా ఆర్యవైశ్యసంఘం అధ్యక్షులుగా శ్రీ గుడివాడ రామచంద్ర రావు



పై సంఘం సర్వ సభ్య సమావేశము 22.1.1995వ తేదీన గుడివాడలో జరిగింది. సంఘాధ్యక్షులు శ్రీ బొగ్గవరపు తిరుపతయ్య గారు సమావేశానికి అధ్యక్షత వహించారు. ఈ సందర్భంగా శ్రీ కోట వెంకటేశ్వర్లు గారి పర్య వేక్షణలో జరిగిన అధ్యక్ష ఎన్నికల్లో, మచిలీపట్నం పుర ప్రముఖులు, శ్రీ గుడివాడ రామచంద్ర రావు గారు అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. శ్రీ రామచంద్రరావుగారు రైసుమిల్లర్ల సంఘానికి ప్రసిడెంటు. లయన్స్ క్లబ్బు మాజీ అధ్యక్షులు. అనేక ఆర్థిక, సమాజిక సేవా సంస్థల కార్య క్రమాల్లో చురుకుగా పాల్గొంటూ ప్రజా సేవ చేస్తున్న ప్రముఖ వ్యక్తులు.

## పానకాలరావుకు పుష్పాభిషేకం

విజయవాడ ఒకటవ పట్టణము, శివాలయం వీధిలో గల శ్రీ కన్యకా పరమేశ్వరీ అన్నసత్రములో పని చేస్తున్న శ్రీ వనమా పానకాలరావు గారికి 15.1.1995న సదరు సత్రం సిబ్బంది ఘనంగా పుష్పాభిషేకం చేశారు. శ్రీ పానకాల రావు గారు రంగస్థల నటులు కూడ.

# రామచరిత మానసం

( తులసీ రామాయణము )

తెలుగు సేత : శ్రీ గాధంశెట్టి శ్రీరాములు, యం.ఎ.

( గత సంచిక తరువాయి )

కోరిక పురుగువంటిది. శరీరం కట్టె వంటిది. ఈపురుగు అనే కోరికశరీరమందు లేనివాడు ఎవడున్నాడు. పుత్రుని మీద, ధనం మీద, ప్రతిష్ఠ పైన వుండే తీవ్రమైన కోరికలు ఎవరి బుద్ధిని మలినం చేయడంలేదు? ఇవన్నీ కూడా మాయ యొక్క చమత్కారాలు. ఇవి అపారమైనవి. వీటిని ఎవరూ వర్ణించలేరు. పరమ శివుడు, బ్రహ్మ కూడా ఈ మాయకు భయపడుతూ వుంటే, ఇతరులు ఒక లెక్కా? లోకమంతా మాయ వ్యాపించి వుంది, కామ, క్రోధ, లోభ, మోహాలు దాని సేనాపతులు. డంభము, కపటము, అసూయ దాని పరివారం. ఆ మాయ శ్రీ రఘుపతి యొక్క దాసి. దాన్ని గుర్తించినట్లయితే అది మిథ్యయే. కాని శ్రీ రామచంద్రుని దయలేకుండా అది వదలదు. నేను ఖండితంగా చెబుతున్నాను.

శ్రీ రామచంద్రుడు సచ్చిదానంద స్వరూపుడు. జన్మరహితుడు. విజ్ఞాననిధి. బలవంతుడు. సర్వవ్యాపకుడు. జ్ఞానవంతుడు. అమితశక్తివంతుడు. అష్టైశ్వర్యాలతో తులతూగే వాడు. నిర్గుణుడు. మాయారహితుడు, జితేంద్రియుడు. మోహరహితుడు. దోషరహితుడు. అందరి హృదయాల్లో నివసించేవాడు, కోరికలులేనివాడు, నాశనములేనివాడు.

అట్టి శ్రీరామచంద్రుడు భక్తుల కొరకై మానవ శరీరం దాల్చిసాధారణ మనుష్య మాత్రునివలె పరమ పావన చరిత్రను నిర్మించాడు. మలిన బుద్ధిగలవాడు, విషయలోలుడు, కాముకుడు అయిన మనుష్యుడే శ్రీ రామచంద్రుని యెడ సామాన్య భావాన్ని ఆరోపణ చేస్తూ వున్నాడు. నేత్ర దోషం గలవారికి చంద్రుడు పచ్చంగా కనిపిస్తాడు. భ్రమ పడినవాడు సూర్యుడు పశ్చిమాన ఉదయిస్తాడని చెబుతాడు. నౌకపై ఎక్కిన వాడు ప్రపంచం కదులు తున్నట్లు, తాను స్థిరంగా వున్నట్లు మోహవశాన భ్రమపడతాడు. బాలుడు గిరిగిరా తిరుగుతూ ఇళ్లు వగైరా తిరుగుతున్నాయనుకుంటాడు.

శ్రీహరికి మోహం కలదని ఆరోపించడం కూడా ఇటువంటిదే. భగవంతునికి స్వప్నమందు కూడా అజ్ఞానమనేది వుండదు. కాని మాయాధీనులు, మందబద్ధులు అయిన మనుష్యుల మనస్సులో అనేక విధాలగు అజ్ఞానపు తెరలు అలముకొని వుంటాయి. గరుత్మంతా, శ్రీ రామచంద్రుని మహిమ గురించి చెబుతాను విను. నాకు ఏ విధంగా మోహం కలిగిందో ఆ కథనంతా చెబుతాను విను. శ్రీ రామచంద్రుని సహజ స్వభావం విను. ఆయన తన భక్తుల మనస్సులో

అహంకారాన్ని లేశమైనా వుండనీయడు. ఎందుకంటే అది మానవుల జనన మరణ బంధనాలకు కారణం అవుతూవుంది. తల్లి తన బిడ్డకు కురుపు లేచినప్పుడు ఏడుస్తూ వున్నా సరే, త్వరగా నయం కావడానికి ఆ పుండునుచిదిమి మందురాస్తుంది. అలాగే శ్రీరాముడు భక్తుల క్షేమానికై అలా చేస్తాడు. అది మొదట కొంత బాధ కలిగించినా ఆనక ఆరోగ్యకరమే అవుతుంది.

పక్షిరాజా, ప్రభువైన శ్రీ రాముని భక్త వాత్సల్యము, నా తెలివి తక్కువ తనము వివరిస్తాను, విను.

నేను తరచుగా అయోధ్యా నగరానికి వెళ్లివస్తూ వుండేవాణ్ణి. ఎందుకంటే. బాల రూపుడైన శ్రీరామచంద్రుడు నా ఇష్ట దైవము. ఆయన లీలలు చూడాలనే ఆపేక్షతో కాకి రూపం ధరించి బాలరాముని వెంటనంటి తిరుగుతూ, ఆ స్వామి దివ్యసుందర స్వరూపాన్ని సందర్శిస్తూ, ఆయన ఎంగిలి తింటూ వుండేవాణ్ణి. త్రిభువన మోహనమైన ఆ ప్రభువు యొక్క దివ్యసౌందర్యాన్ని ఎంతని వర్ణించేది? ఏమని చెప్పేది?

అయోధ్యలో రాజభవనానికి వెనుక రమణీయమైన ఉద్యానవనం వుంది. బాలుడైన శ్రీరాముడు ఆడుతూ పాడుతూ సహోదరులతో కూడి అందు విహరిస్తూ వుండేవాడు. ఒకా నొక సమయాన ప్రభువు అత్యద్భుతమైన లీలా విలాసం చేశాడు. నేను దాన్ని మరువలేను. వర్ణింపలేను. శక్తికొలది చెబుతాను, సావధానంగా విను. కాకినై అల్లంత దూరాన ఎగురుతున్న నన్ను పట్టుకొనాలని బాల రాముడు నవ్వుతూ నా వైపు తన చేతులు చాపాడు. నేను భయపడి ఆ చేతులకు అందకుండా ఎగిరి అటూ ఇటూ పరుగెత్తి బ్రహ్మ లోకానికిపోయి వెనక్కు తిరిగి చూశాను. ఆశ్చర్యము! బాలరాముని చిన్నారి చేతులు నా వైపుకే చాచి వున్నాయి. ఆ చేతులకు, నాకు రెండంగుళాల దూరమే వుంది. మళ్లీ అక్కడి నుండి వేగంగా ఎగిరి తిరిగి చూస్తే మళ్లీ రెండంగు ళాల దూరమే కనిపించింది. మళ్లీ ఎగిరి మేడల ఆవరణాలు దాటిపోయాను. కాని మళ్లీ రెండంగుళాల దూరమే. అప్పుడు నేను ఎంతో ఆశ్చర్య పడ్డాను, భయంతో కళ్లు మూసుకున్నాను. తిరిగి కళ్లు తెరచి చూశాను శ్రీ రామచంద్రుడు చిరునవ్వు నవ్వాడు. అలానవ్వుతూ వుండగా నేను ఆయన నోటిలోనికి దూకి ఆయన గర్భ మందు ప్రవేశించాను.

అక్కడ అనేక మంది బ్రహ్మలు, సూర్యచంద్రులు, నక్షత్రాలు, అరణ్యాలు, పర్వతాలు, సముద్రాలు, నదులు, దేవతలు,రాక్షసులు, యక్షులు, కిన్నరులు, కింపురుషులు కలిగిన అనేక లోకాలు కనిపించాయి. అవన్నీ ఒకదాన్ని మించి ఒకటి వున్నాయి. ఒక్కొక్క లోకంలో నేను నూరు సంవత్సరాలు గడిపాను. అది అంతా నాకు ఆయన ఉదరంలో రెండు ఘడియలవలె మాత్రమే అనిపించింది. శ్రీ రామచంద్రుడు మరల నవ్వాడు. అలానవ్వుతూ వుండగానే నేను బయటకు వచ్చేశాను. అప్పుడు నా మనస్సుకు కలిగిన సంతోషం అంతా ఇంతా కాదు. కాని ఆయన కడుపులో

వున్నప్పుడు చూసినదంతా జ్ఞప్తికి వచ్చి నేను దీనుడనై ఏడ్చాను. అప్పుడు శ్రీ రామచంద్రుడు నన్ను తన దాసునిగా అనుగ్రహించి నన్ను ఆవహించిన మాయను తొలగించాడు. అప్పుడు నా మనస్సు శాంతించింది.

అప్పుడు భగవంతుడు నాకు ప్రత్యక్షమై "కాక భుశుండీ, నీ పైన నాకు ప్రేమ కలిగింది. నీ కిష్టం వచ్చిన వరము కోరుకో! ధనమా! ధాన్యమా! ఐశ్వర్యమా? ఏం కావాలో అడుగు. ఇస్తాను" అన్నాడు.

ఆయన ఉదారతకు నేను సంతోషించి "దేవా, మీ పాద పద్మాలందు గాఢ భక్తి కలిగివుండులాగున వరమివ్వండి" అని అడిగాను. అప్పుడు శ్రీరామచంద్రుడు 'తథాస్తు' అని అనుగ్రహించి దీవించి ఇలా చెప్పాడు.

"కాక భుశుండీ, నేను పుట్టేవాణ్ణి కాదు. అందరి హృదయాల్లోనూ వుంటాను. అన్నిటిని ఎరిగినవాణ్ణి. నన్ను భజించేవారి భారాన్ని నేను వహిస్తాను. పద్నాలుగు లోకాలూ నా చేతనే సృష్టించబడ్డాయి. అందువల్ల జీవులన్నీ నాకు ప్రియమైనవే! భక్తి కలిగినవాడు నీచుడైననూ, నాకు ప్రియమైనవాడే!

ఒక తండ్రికి పదిమంది పుత్రులు వున్నారనుకో! వాళ్లలో ఒకడు వీరుడు, ఒకడు తాపసి, ఒకడు పండితుడు, మరొకడు సత్యవ్రతుడు, వేరొకడు జ్ఞాని, ఇంకొకడు విరాగి, ఒకడు తండ్రికి సేవ చేసేవాడు. ఆ తండ్రికి వీళ్లందరి మీద ప్రేమ వుంటుంది. అయినా ఎల్లప్పుడు తన సేవ యందే కాలం గడిపే పుత్రుని పట్ల ఎక్కువ ప్రేమ వుంటుంది.

మదము, మోహము, అహంకారము వొదిలి నన్ను భజించేవాళ్లు నాకు ఎంతో ప్రియమైనవాళ్లు. నా ఆశీర్వాద బలం చేత నీయందు భక్తి, జ్ఞాన, వైరాగ్యాలు దిన దినాభివృద్ధి చెందుతాయి. ఇక నీకు నా మాయా మోహాలు వ్యాపించవు. నన్ను పరబ్రహ్మగా తలంచు. భగవంతుని భజించని వాడు భవసాగరాన్ని దాటజాలడు. శాంతిని పొందలేడు. నా మహిమ అనన్యమైనది. అనంతమైనది. దాన్ని ఆది శేషుడు కూడా వర్ణించలేడు."

ఈ విధంగా నాతో పలికిన ప్రభువు సామాన్య బాలకుని మాదిరి కళ్ల వెంట నీళ్లు కారుస్తూ తన తల్లి వైపు చూసి ఏడ్వడం మొదలెట్టాడు. అప్పుడు కౌసల్య పరుగు పరుగున వచ్చి బాలరాముణ్ణి ఎత్తుకొని ముద్దులాడి ఒళ్లో కూర్చొ బెట్టుకొని పాలిచ్చింది. ఇట్లు కొంతకాలము అయోధ్యలో గడిపి శ్రీరాముని బాల లీలలు కళ్లారా చూసి వచ్చాను.

గరుత్మంతా, మీరు మీ మీ శక్తి కొలది ఆకాశాని కెగురుతూ వుంటారు. కాని ఆకాశం యొక్క అంతం తెలిసిన వారు ఎవరూ లేరు. రామ మహిమ ఇదే. భగవంతుని బలం అనంతము. ఆయన శక్తి గొప్పది. అంతటి వారు మరొకరులేరు. ఆయనకు ఆయనయే సాటి. గురూపదేశం లేనిదే భవసాగరం దాటలేరు.

ఈ విధంగా చెప్పిన కాక భుశుండి మాటలు విని గరుత్మంతుడు సంతోషించి "మహాను భావా, మీ ఉపదేశంవలన నాకు జ్ఞానం కలిగింది. నా అజ్ఞానం నశించింది.

నా సందేహాలు తీరిపోయాయి. మీరు శ్రీరాముని పరమభక్తులు. ఆయన గుణాలన్నీ ఎరిగివున్నారు. కాని మీరు ఆకాశంలో విహరించేవారు కదా! అయోధ్యలో నున్న శ్రీ రామచంద్రుణ్ణి కలయడం ఎట్లా తటస్థించిందీ? మరి, ప్రళయ కాలంలో లోకాలన్నీ నశిస్తాయని పురాణాలు చెబుతున్నాయి గదా! ప్రళయ కాలంలో మీరుగాని, ఈ ప్రదేశంగాని, నశించదని చెబుతున్నారు. ఇది ఎలా సాధ్యమో చెప్పండి." అని అడగ్గానే కాక భుశుండి అందుకున్నాడు. (ఇంకా ఉంది)

కడప పట్టణ ప్రముఖులు, శ్రీ మునగా రంగయ్య శ్రేష్ఠి గారి కుమార్తె చి॥ ఇందిర వివాహం, నంద్యాల వైశ్య ప్రముఖులు శ్రీ గుండా సత్యనారాయణ శ్రేష్ఠి గారి కుమారులు చి॥ రామక్రిష్ణ చక్రవర్తి బి.ఇ. (మెకానికల్) గారితో 9.2.1995వ తేదీన కడప, దేవునికడప రోడ్డులోని కె.యస్.ఆర్. కల్యాణ మంటపములో వైభవంగా జరిగింది.

## గుప్త గారి శ్రీ కన్యకా పురాణ ప్రచురణకు తోడ్పడండి

### – శ్రీ దోమా వెంకటస్వామి గుప్త సాహిత్య పీఠం విజ్ఞప్తి

మహాకవులు,అవధాని శేఖరులు శ్రీ దోమా వెంకటస్వామి గుప్త గారు వ్రాసిన శ్రీ కన్యకాపురాణ ప్రచురణను పై పీఠం వారు ఆరంభించారు. రూ.116/-లు పంపి ఈ ప్రచురణకు తోడ్పడవలసిందిగా పై పీఠము వారు విజ్ఞప్తి చేస్తున్నారు. రూ.116/-లు పంపిన వారికి ఒక ప్రతిని పంపుతారు. అట్టివారు పీఠములో జీవిత సభ్యులుగా కూడ ఉంటారు. రూపాయలను డి.డి.ద్వారా పంపువారు ఆ డి.డి.ని 'శ్రీ దోమా వెంకటస్వామి గుప్త సాహిత్య పీఠము' పేర ప్రొద్దుటూరులోని ఏ షెడ్యూలు బ్యాంకులో నైనా నగదు అగునట్లుగా, శ్రీ దోమా వెంకటస్వామి గుప్త సాహిత్య పీఠం, కేరాఫ్ వైశ్య ప్రబోధినీ కార్యాలయం, జయనగర్ కాలనీ, కడప - 516 002 అడ్రసుకు పంపాలి. రూపాయలను యం.ఓ ద్వారా పంపువారు నేరుగా పై అడ్రసుకే పంపవచ్చు.

గుప్త గారి గ్రంథాలు వెలుగు చూచుటకు తోడ్పడడం ప్రతి వైశ్యుడూ తమ విధిగా, కర్తవ్యంగా భావించాలి.

**ఇంతవరకూ అందిన విరాళాలు**

రూ.116-00 శ్రీ రామయ్యగారు, నంద్యాల (యం.ఓ)

రూ.116-00 శ్రీ తుమ్మలపల్లి సుబ్రమణ్యం గారు, తణుకు (డి.డి)

# షష్ఠ భావ - విచారణ

రచన : న్యత్రసాల వేణుగోపాల్, బి.ఎ., ధర్మవరము.

భాగ్యము ఎంత వున్నప్పటికీ ఆరోగ్యము లోపించిన జీవితము కడు దుర్భరము. అందుకే "ఆరోగ్యమే మహా భాగ్యము" అన్నారు పెద్దలు. ఋణ, రోగ, శత్రునివృత్తులు తెలుసుకొనుటకు ఉత్సుకత కనపరచుట సహజము. అట్టి ఈ త్రిమూర్తి జ్ఞాన రహస్య సందర్శన ఈ షష్ఠభావము నుండి తెలుసుకొనవచ్చును. ఈ భావము లగ్నము నుండి ఆరవది. ముఖ్యముగా శత్రువుల విషయములో శత్రు స్థానమును, శత్రుస్థానాధిపతిని, లగ్నమును, లగ్నాధిపతిని, గమనించినచో శత్రు విషయములను క్షుణ్ణంగా తెలియవచ్చును.

రోగ విషయమును కనుగొనవలెనన్న ఆరవస్థానము, తత్ అధిపతి, లగ్నము, లగ్నాధిపతిని గుర్తించుట చాలా ముఖ్యము. జాతకుడు ధనజాతకుడా, ఋణ జాతకుడా? అని తెలుసుకొనవలెనన్న ఆరవ స్థానము, తత్ అధిపతి, ధనస్థానము, ధనస్థానాధిపతి, ఆరవ స్థానమునకు ఆరవదియైన లాభ స్థానమును తత్ అధిపతిని గుర్తించుట చాలా ముఖ్యము. పై మూడు విషయములకు పై స్థానములనే కాక తృతీయ, ద్వాదశములకు సహ సంబంధ వ్యవహారములు కలవు. లగ్నాధిపతికాని, ధనాధిపతికాని లాభాధిపతి కాని 6, 8, 12 స్థానములయందున్న జాతకునకు ఋణము విశేషముగా వుండును. ధనాధిపతి దుర్బలుడై ఋణాధిపతి అనగా ఆరవస్థానాధిపతి బలయుతుడై యున్నను, ధనస్థానము నందు పాపగ్రహములున్నను ధన ఋణాధిపతులు కలసియున్నను, లేక పరివర్తన గతులై యున్నను ధన వ్యయాధిపతులు కలసియున్నను, పరివర్తన గతులై వున్నను, లగ్న, ధనాధిపతులు ఋణాధిపతితో కలసి 6, 8, 12 స్థానములయందున్న కాని, లేక 6, 8, 12 అధిపతులు లగ్న, ధన స్థానములయందున్న కాని ఆరవస్థానము నందు పాపగ్రహములున్నను, జాతకునకు ఋణము అధికముగా వుండుననుట శాస్త్ర సమ్మతము.

3, 6, 12 అధిపతులు 5, 9, 11, ట వున్న యెడల నిస్సంశయముగా జాతకుడు ఋణము కలవాడగును. అట్లుగాక లాభాధిపతి 3, 6 అధిపతులతో కలయక లాభమందుకాని, పంచమ, భాగ్యములయందు వున్న యెడల జాతకునకు మంచి ధనయోగము పట్టును. లాభాధిపతి పంచమ, నవమాధి పతులతో ఏ ఒక్కరితోనైనను కలసి కేంద్ర కోణములలో వున్న యెడల అదియును మంచి ధనయోగము. లాభాధిపతి 3, 6, 12 స్థానాధిపతులతో కలసి కేంద్రములలో యున్న సామాన్యయోగము గుర్తించుము. తృతీయ, షష్ఠ లాభ వ్యయాధిపతులు నైసర్గిక శుభులై కేంద్రముల యందున్న కొంత ఋణ యోగ మున్నను,

రాజయోగమును సహాఇచ్చును. అదియే అధిపతులు నైసర్గిక పాపులై కేంద్రముల యందున్న ఋణగ్రస్తులుగాను వుండగలరు.

ఏ లగ్నమున కైనను 6, 11, అధిపతులు గల గ్రహములు, 3, 6, 12 ఇంట వున్న యోగప్రదము కానేరదు. ఋణబాధ వుండగలదు. ధనభావము నందు పాప గ్రహములుండి లగ్నాధిపతి వ్యయ మందున్న ధనహీనుడై ఋణ బాధను పొందగలడు. లాభాధిపతి ఎనిమిదింట వుండి ధనాధిపతి నీచ యందున్నను, ద్వితీయాధిపతి పాప గ్రహములతో కలసి ద్వితీయ అష్టభావములందున్న జాతకుడు ఋణగ్రస్తుడగును.

శత్రువుల విషయమై ఆలోచన చేయు నపుడు ఆరవస్థానమును గమనించినపుడు ఆరింట పాప గ్రహములున్నను, తత్ స్థానమును పాప గ్రహములు చూచినను, తత్ స్థానాధిపతి పాప గ్రహములచే చూడబడు చున్నను శత్రువులు విశేషముగా జాతకునకు వుండుననుట శాస్త్ర సమ్మతము. లగ్న షష్టాధిపతులు పరివర్తన గతులై శనితో గాని, రాహువుతోగాని కలసిన యెడల తప్పక శత్రువృద్ధి కలుగును. శత్రుస్థానాధిపతి బలహీనుడై పాప గ్రహము లచే చూడబడినను తప్పక శత్రువులు వుండగలరు. ముఖ్యముగా ఆరవస్థానాధిపతి 6, 8, 12 ఇంటకానీ, నీచయందుకానీ, వుండి లగ్నాధిపతి బలయుతుడై వున్న నిస్సంశయముగా జాతకునకు శత్రువులు వుండరు. రిపుస్థానమున పాపగ్రహము లున్న శత్రువులుండుట, శుభగ్రహము లున్న శత్రువులు లేకుండుట సాధారణ ముగా సంభవించును.

శత్రుస్థానమునందు శుభగ్రహములు న్నను, తత్ స్థానాధిపతి శుభగ్రహములతో కలసినను, మిత్ర ఉచ్చ, స్వక్షేత్రముల యందున్న శత్రువులతో జాతకుడు మైత్రీబంధనమును ఏర్పరచుకొనగలడు. శత్రు స్థానాధిపతి భాగ్యస్థానమునందుండి పాపగ్రహ భూయిష్టుడై యున్న స్వల్ప భాగ్యము, శత్రుపీడ, జాతకునికి ఛాయవలె వెంటాడి పీడించును. షష్ట లాభాధిపతులు పరివర్తనగతులై వున్న జాతకునకు 30 సంవత్సరములయందు శత్రువులచే ధన వ్యయము జరుగును. లగ్నాధిపతి ఆరింట వున్నను లేక లగ్నాధిపతి షష్టాధిపతిచే చూడబడినను, లగ్న షష్టాధిపతులు లగ్నమందున్నను, అట్టి జాతకుడు దాయాదులచే అధిక కష్టనష్టములకు గురికాగలడు.

"బ్రతికి యుండిన శుభములు బడయవచ్చు" అను ఆర్యోక్తి ప్రకారము జాతకుడు నిరోగిగా వుండుటకు జీవిత మంతా పాటుపడుచూ వుండును. ఈ విషయమై తెలుసుకొనుటకు ముందు ఈ క్రింది విషయములు గమనించుము.

రాహువు ఆరింట వున్న మూల వ్యాధి (పైల్స్) గల వాడును, ధైర్యవంతుడును అగును. శని ఆరింటవున్న విజయుడు, పాత రోగిగా జాతకుడు వుండును. ఆరింట కుజుడు వున్న నిత్య కలహి, స్ఫోటక

బాధితుడు అగును. అరింట చంద్రుడు వున్న బాల్యమునందు నిశ్చయముగా రోగిష్టిగా వుండును.

అష్టమాధిపతికాని, షష్ఠాధిపతికాని లగ్నమునందున్న రోగిష్టివాడుగా వుండు ననుట నిశ్చయము. షష్ఠవ్యయాధిపతులు పరివర్తన గతులై వున్న జాతకునకు

ఆరింట గురువు వున్న దీర్ఘ రోగము, బుధుడు వున్న పైత్య రోగము, శుక్రుడు వున్న భార్యతో నిత్యకలహము కలుగు చుండును. లగ్నాధిపతి ఆరింట వున్న శత్రువులను జయించును. కాని కుమారుడు ధనమును తీసికొనిపోవును. షష్ఠాధిపతి శుక్రునితో కలసినను, రవికాని, శని కాని, రాహువుతో కలసినను జాతకుడు భయభీతులతో సర్వవేళలా భయపడు చుండును.

6, 8 ఇంట రాహువు వుండి ఆ రాహువునకు ఎనిమిదింట శనివుండి, లగ్నాధిపతికి ఎనిమిదింట చంద్రుడున్న జాతకుడు క్షయరోగముచే భాదల నొంద గలడు.

రిపు స్థానమున నవగ్రహములున్న ఏయే ఫలితములు జాతకునకు సంభవ మగునో తెలసికొందము.

ఆరింట రవి వున్న జాతకుడు బుద్ధి మంతుడు, రూపసిగా, గృహ యజమానిగా, శత్రువిజేతగా, శాస్త్రకారకుడై యోగ్యమగు పనులు చేయుచూ యోగ్యుడై వుండ గలడు. ఆరింట నీచ చంద్రుడువున్న రోగిష్టిగా, సౌఖ్యహీనుడై, దుఃఖములు అనుభవించుచూ పలు కష్టముల పీడితుడై యుండును. ఆ చంద్రుడు పూర్ణ చంద్రుడై యున్న మిక్కిలి భోగములు అనుభవించుచూ, నిత్య సంతోషిగా వుండగలడు. ఆరింట కుజుడు వున్న రోషముగలవాడు, శత్రువిజేతయై సజ్జన సహవాసిగా వుండగలడు. కాని కామాతురుడై మంచి భోక్తగా వుండుట సహజము. ఆరింట బుధుడు వున్న శత్రుభాదలనొందగలడు. తత్ బుధుడు శుభగ్రహ వీక్షితుడుగా వున్న శుభరాశి యనగా మిత్ర, ఉచ్ఛగతుడై వున్న శత్రువిజేతగా వుండగలడు. ఆరింట గురువు వున్న సోదర వృద్ధిగలిగి శత్రువిజేతయై మిక్కిలి ధనవంతుడై వాసికెక్కగలడు. ఆరింట శుక్రుడు వున్న శత్రువులకు లోబడువాడు. బాలారిష్టములు కలవాడు. ధనవంతుడైనను, బాగుగా ధనవ్యయము చేయును. శని ఆరింటవున్న నీచ గతుడై వున్నను, శత్రుగ్రహక్షేత్రము నందున్న యెడల జాతకుడు ఋణ విముక్తుడు, నిరోగియు, ధనవంతుడు, సంతానవంతుడు, శత్రుజయశీలుడై వాసికెక్కగలడు. రాహుకేతువులు ఆరింటవున్న శత్రువిజేత, ధనపుత్రాదులు కలవాడు, విద్యావంతుడు, బుద్ధిమంతుడు, నిరోగి, నిత్య ధనవంతుడై సుఖముల పొందును.

షష్ఠాధిపతి షష్ఠమందున్న యెడల ఇతరులకు మిత్రుడుగను, స్వకీయులకు శత్రువుగను వుండగలడు. షష్ఠాధిపతి ఏడింటగాని, పదకొండింటకాని, లగ్నము నందుకాని వున్న జాతకుడు సాధారణ

ముగా పుత్రులకు దూరముగా వుండును. అయితే సాహసిగను, అభిమాన వంతుడుగను, ధనవంతుడుగను, కీర్తి, యశస్సు కలిగి వినుతి కెక్కగలడు.

షష్టాధిపతి ఎనిమిదింటకాని, వ్యయమందుకాని వున్న యెడల జీవహింస చేయువాడు, రోగిష్టిగా పండితులకు విరోధిగా, పరపత్నుల పొందగోరు కాముఖుడుగా వుండగలడు. షష్టాధిపతి నవ స్థానము నందున్న వ్యవహార, వ్యాపారముల యందు, లాభనష్టములు తరచు కలుగుచుండును. జీవనము వ్యాపారమనియే గ్రహించును. షష్టాధిపతి దశమ కేంద్రమునగాని, ధనస్థానమందుకాని వున్న సాధారణముగా జాతకుడు స్వధర్మ నిష్టాపరుడు, మంచి వక్తగను, సాహస వంతుడుగను, కులశ్రేష్టుడై వాసికెక్కగలడు. షష్టాధిపతి చతుర్థ, తృతీయము అందున్నపుడు జాతకుడు ధనవంతుడుగా వున్నప్పటికీ, క్రోధము కలవాడుగను, చంచలుడుగను, పిసినారిగను వుండి స్వతంత్రుడై మనగలడు.

షష్టాధిపతి పంచమమందున్న యెడల ధనవంతుడుగను, దయావంతుడుగను, మంచి స్వభావము కలిగి పదిమందిలో పేరు ప్రఖ్యాతులు కలిగి తన కార్యములు నెరవేర్చుకొను పనితనము కలిగి గొప్పవాడై మనగలడు.

## న్యాయం జరగాలి

ఆర్యా!

ఆ 1995 జనవరి వైశ్య ప్రబోధినిలో ప్రకటనలు తెచ్చిన ప్రమాదం - అను మీ సంపాదకీయం వాది, ప్రతివాదులకు నచ్చే విధంగా ఉంది. వాది ప్రతి వాదులు కుంజర యూధమ్ము దోమకుత్తుక చొచ్చెన్. అను సూక్తి విధంగా ఉన్నదని మీకు తెలియంది కాదు. మహా సాధ్వి సీతమ్మ గారు వ్రాసిన విల్లుకు విరుద్ధముగా ధర్మకర్తలు ప్రవర్తించుటయే దీనికంతకూ మూలము. ధర్మ కర్తలుగా వారికి ఎట్టి అధికారాలు కలవో, అట్టి అధికారాలే ఆర్య వైశ్యు లందరికీ యీవిల్లు విషయములో ఉన్నవి. సీతమ్మ ఆస్తి విషయములో ఎందుకో మరి ధర్మ కర్తలు తమ నిర్ణయమే తుది నిర్ణయమని భావించి, పెత్తనం చూపి నలుగురు నోళ్ళలో నాని ఈ సమస్యకు కారణమై ఈ మంకు, రంకు న్యాయస్థానాల తీర్పు వరకూ వచ్చింది. పవిత్రంగా, పదిమందికీ అనుకూలంగా నిర్ణయాలు తీసుకోవాల్సిన ధర్మ కర్తలు తమకు తామే మలినత్వాన్ని ఆపాదించుకొన్నారు. ఈ జనవరి 1995 మీ వైశ్య ప్రబోధినిలోని సంపాదకీయం వల్ల న్యాయం జరుగ వలసి ఉంది.

ఇల్లూరు శంకరయ్యగుప్త
*గుత్తి. 21.1.95*

**జీవిత సభ్యత్వ చందా**
**రూ.400/-**

## తమసేవ మెచ్చుకొనతగినది

ఆర్యా!

"వాసవి", మీ పత్రిక వైశ్య ప్రబోధినిని నాకు మీరు పంపుచున్నారు. మీరు జరుపు చున్న కార్యక్రమాలను, మీ భావనలను, సూచనలను అన్నీ గమనిస్తున్నాను. తమ సేవ మెచ్చుకొన తగినది.

కె. రాధాకృష్ణయ్య
*కల్లూరు (ఆర్.యస్.). 30.1.95*

## చందా వివరాలు తెలపండి

శ్రీయుత గౌరవనీయులైన సంపాదకుల గారికి నమస్కారాలు. వైశ్య ప్రబోధినిలో ఎన్నో విజ్ఞానదాయకమైన విషయా లుంటాయని నా మిత్రుడు చెప్పాడు. వైశ్య ప్రబోధిని కొరకు మా ప్రాంతాలలో ఎంత వెదకినా దొరకలేదు. చందా వివరాలు తెలపండి. వైశ్య ప్రబోధినిలో గల శ్రీమతి బి. లక్ష్మీకాంతమ్మ గారి వ్యాసాలు చదివితిని. వారి పూర్తి విలాసము వ్రాయ గోరెద.

వి. లింగమూర్తి
*కోరట్ల, కరీంనగర్ జిల్లా. 11.1.1995*

## వివాహం

కడప జిల్లా ప్రొద్దుటూరు పుర ప్రముఖులూ, ప్రొద్దుటూరులోని సర్వ వర్తక సంఘాల సమాఖ్య అధ్యక్షులూ, శ్రీ వంకదార వీరభద్రయ్య గారి కుమారులు చి॥ శ్రీనివాసులు వివాహం, నెల్లూరు శ్రీ తాతా రాఘవయ్య గారి కుమార్తె చి॥ భాగ్యలక్ష్మితో 10.2.1995వ తేదీన నెల్లూరులోని ఆదెయ్య నాయుడు అతిథి గృహములో వైభవంగా జరిగింది.

# బళ్ళారి ప్రాంతీయ వైశ్య విద్యానిధి వారిచే ఆర్థిక సహాయం

పై విద్యానిధి సర్వసభ్య సమావేశము 25.12.1994వ తేదీన జరిగింది. శ్రీ జి. వెంకటేశ్వర్లు గారి అధ్యక్షతన జరిగిన ఈ సమావేశములో, తమ విద్యా భివృద్ధికి సహకరించమని కోరుచూ వచ్చిన విద్యార్థినీ విద్యార్థుల దరఖాస్తులు పరిశీలించి, వైద్య విద్యను అభ్యసిస్తున్న విద్యార్థులు ఇద్దరికి ఒక్కొక్కరికి రూ.3000/-ల ప్రకారమూ, ఇంజనీరింగ్ చదువు చున్న విద్యార్థులు 8 మందికి, ఒక్కొక్క రికి రూ.3000/-ల చొప్పున, డిప్లొమా చదువుచున్న విద్యార్థులు నలుగురికి ఒక్కొక్కరికి రూ.1000/-ల ప్రకార మూ, కామర్సు విద్య నభ్య సిస్తున్న విద్యార్థులు ఇద్దరికి ఒక్కొక్కరికిరు.1000/-ల చొప్పున వెరశి 36వేల రూపాయలను తిరిగి తీర్చుకునే పద్ధతి (లోనుగా) లో మంజూరు చేశారు. మెరిట్ స్కాలర్ షిప్పులకు వచ్చిన దరఖాస్తులను పరిశీలించిన ఈ సమావేశము వైద్య విద్యనభ్యసిస్తున్న డాక్టర్ - జ్యోతిర్మయి, ఇంజనీరింగ్ చదువు చున్న శ్రీ బిజేస్ బనపూర్, వ్యవసాయ విద్య నభ్యసిస్తున్న శ్రీ కె. ఆర్. క్రిష్ణబాబు, వ్యాపార విద్య నభ్య సిస్తున్న శ్రీ యన్. చంద్ర శేఖర్ గారలకు ప్రతిభా బహుమతులను మంజూరు చేసింది.

పవిత్రమైన, ఆశయాదర్శాలతోనూ, మిక్కిలి చిత్తశుద్ధితోనూ ఈ ప్రాంతీయ వైశ్యవిద్యానిధి నిర్వహిస్తున్న తమ ఆధ్వర్యమున నడపబడుచున్న శ్రీ డి.యల్. శ్రేష్ఠి స్మారక విద్యా సహాయ నిధికి, విద్యాభ్యాసానికై సహాయాన్ని కోరుచూ వచ్చిన దరఖాస్తులను పరిశీలించి, పదవ తరగతి, ప్రీయూనివర్శిటీ మొదటి, రెండవ సంవత్సరము, డిప్లొమా, చదువు విద్యార్థులు వెరశి 43 మందికి ఒక్కొక్కరికి రూ.200/-ల చొప్పున, ప్రాథమిక విద్య నభ్యసించు విద్యార్థులు ఏడుమందికి ఒక్కొక్కరికి రూ.150/-ల చొప్పున, పదవతరగతి, ప్రీ - యూనివర్శిటీ మొదటి, రెండవ సంవత్సరము చదువు విద్యార్థులు వెరశి 8 మందికి ఒక్కొక్కరికి రూ.50/-ల చొప్పున ప్రోత్సాహక సహాయాన్ని కూడ ఈ సమావేశములో మంజూరు చేశారు. సమావేశ ప్రారంభములో ఈ నిధి మహారాజ పోషకులుగా ఉండి స్వర్గస్తులైన డాక్టర్ శ్రీ సి.వి. యస్. రత్నం గారి మరణమునకు సంతాపమును ప్రకటించి శ్రద్ధాంజలి ఘటించారు.

ఈ నిధి యొక్క మహారాజ పోషక సభ్యత్వమును సరి క్రొత్తగా స్వీకరించిన హైద్రాబాద్ వాస్తవ్యులు సర్వశ్రీ కె.వి.సుబ్బారావు, జి.వెంకటేశ్వర్లు, డాక్టర్ యల్. వెంకట రత్నం, పి. రామ మోహన్ రావు గారలకు ఈ సమావేశము

లు

## కేశఖండనం

కర్నూలు జిల్లా పత్తికొండ వైశ్య ప్రముఖులు శ్రీ చక్కా శివరామకృష్ణ, వీరి సతీమణి శ్రీమతి లలితమ్మ గారల కుమారులు చి॥ గురుతేజ చి॥ హరిణిల కేశఖండన మహోత్సవం 4.2.1995వ తేదీన శ్రీ కంబగిరి నరసింహస్వామి సన్నిధిలో వైభవంగా జరిగింది

గమనిక :- ఈ శీర్షికన ప్రకటన కావాలనుకొనే వారు రూ.116/-లు యం.ఓ. ద్వారా కానీ, డి.డి. ద్వారా కానీ పంపుచూ అవసరమైన ఆహ్వానపత్రికను కూడ మాకార్యాలయానికి చేర్చాలి.

## ఆత్మకూరు ఆర్యవైశ్య సంఘానికి నూతన కార్యవర్గం

కర్నూలు జిల్లాకు చెందిన పై ఆర్యవైశ్య సంఘం సర్వసభ్య సమావేశము 10.1.1995న జరుగ, క్రింది వారలు నూతన కార్యవర్గసభ్యులుగా ఎన్నికయ్యారు. అధ్యక్షులు శ్రీ వేముల వెంగయ్య శ్రేష్ఠి, ఉపాధ్యక్షులు శ్రీ బచ్చు నారాయణ శ్రేష్ఠి, కార్యదర్శి శ్రీ నరహరి నరసింహయ్య శ్రేష్ఠి, ఉపకార్యదర్శి శ్రీ అత్తలూరు శ్రీనివాసులు శ్రేష్ఠి, కోశాధికారి శ్రీ బచ్చు సూర్యనారాయణ శ్రేష్ఠి.

## పడుచూరికి పితృ వియోగం

గుంటూరు పట్టణ వైశ్య ప్రముఖులు శ్రీ పడుచూరి వెంకటేశ్వర్లు గారి తండ్రి శ్రీ బ్రహ్మయ్య గారు 28.1.1995వ తేదీన స్వర్గస్థులయ్యారు.

## హజరత్తయ్యకు సన్మానం

విజయవాడ వైశ్య ప్రముఖులు వాసవి కన్వీనర్, న్యాయవాదులు శ్రీ హజరత్తయ్య గారిని వాసవి సంస్థవారు 10.1.1995వ తేదీన ఘనంగా సన్మానించారు. ఈ సందర్భంగా హోటల్ కృష్ణా రెసిడెన్షియల్‌లో జరిగిన సభకు శ్రీ యం.ఆర్. శ్రీనివాసరావు గారు అధ్యక్షత వహించారు. ఈ సభకు విజయవాడ పురప్రముఖులు, ప్రసిద్ధ న్యాయవాదులు శ్రీ దివ్వెల పిచ్చయ్యగుప్త గారు ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు. బాలల సంక్షేమ సంఘమునకు శ్రీ హజరత్తయ్య గారు ఎన్నికైన సందర్భాన్ని పురస్కరించుకొని ఈ సన్మానం జరిపారు.

## ప్రకాశం జిల్లా ఆర్యవైశ్య సంఘానికి నూతనాధ్యక్షులు

గిద్దలూరు వైశ్య ప్రముఖులు శ్రీ సి.వి. సత్యనారాయణగారు 22.1.1995న ఒంగోలులో జరిగిన జిల్లా ఆర్యవైశ్య సంఘం సర్వసభ్య సమావేశములో ప్రకాశం జిల్లా ఆర్య వైశ్య సంఘానికి అధ్యక్షులుగా ఎన్నికయ్యారు.

## గ్రంధే రామకృష్ణారావు గారి స్వర్గారోహణ

కడపజిల్లా కొండాపురం పుర ప్రముఖులు, కంట్రాక్టర్లు శ్రీ గ్రంధే రామకృష్ణారావు గారు 8.1.1995వ తేదీన స్వర్గస్థులయ్యారు.

## ఈ నెలలో మీ కర్తవ్యము

(21.2.1995 నుండి 20.3.1995 వరకు)

1. అడ్వాన్సు ట్యాక్సు విధింపునకు అర్హతగల అసెసీలు వారు కట్టవలసిన చివరి కంతు అడ్వాన్సు ట్యాక్సును చెల్లించుటకు రానున్న (1995) మార్చి నెల 15వ తేదీయే చివరిది.

గమనిక : సెప్టెంబరు, డిసెంబరు నెలలలో కట్టిన కంతుల మొత్తము యాభై శాతం పోనూ మిగతా చెల్లించవలసిన అంచనా ఆదాయమును పై తేదీలోగా చెల్లించాలి.

2. ఆంధ్ర ప్రదేశ్ షెడ్యూల్డు కామోడిటీస్ డీలర్సు (లైసెన్సింగ్ అండ్ డిస్ట్రిబ్యూషన్) ఆర్డరు 1982 ప్రకారము పొందిన మీ లైసెన్సు కాలపరిమితి రానున్న మార్చి నెలతో ముగుస్తుంది. ఆ లైసెన్సును తిరిగి పునరుద్దరించమని కోరుచూ ఈ (1995) ఫిబ్రవరి నెల 28 వ తేదీలోగా దరఖాస్తును పంపడం మరచి పోకండి.

3. మీరు పంపవలసిన A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను అధికారికి పంపుటకు ఈ మార్చి నెల 20వ తేదీయే చివరిది అను విషయాన్ని మరచిపోకండి.

4. మీరు పంపు A-2 రిటర్నును చలానాతో బాటు కాకుండా చెక్కుతో బాటు పంపాలను కున్నారా? అయితే ఆ విధంగా A-2 రిటర్నును చెక్కుతో బాటు పంపుటను ఈ మార్చినెల 15వ తేదీలోగా చేయాలి.

## ఆంధ్రప్రదేశ్ డాల్ మిల్లర్ల అసోసియేషన్‌కు నూతన కార్యవర్గం

విజయవాడ పట్టణం ప్రధాన కార్య స్థానంగా గల పై అసోసియేషన్ సర్వసభ్య సమావేశము జనవరి 26, 27వ తేదీలలో శ్రీశైలంలోని వాసవీ సత్రములో జరిగింది. ప్రధాన కార్యదర్శి శ్రీ కనమర్లపూడి గాంధీ, కోటేశ్వర రావుగార్లు నివేదికను సమర్పించిన అనంతరము ఈ క్రింది వారిని 1995-1996 సంవత్సరానికి నూతన కార్య వర్గసభ్యులుగా ఎన్నుకొన్నారు. గౌరవాధ్యక్షులు శ్రీ మెంటా మస్తాన్ రావు, విజయవాడ, అధ్యక్షులు శ్రీ భాస్కరుని నరసింహారావు, విజయవాడ. ఉపాధ్యక్షులు సర్వశ్రీ గార్లపాటి ఆంజనేయులు మార్కాపురం, యేల్చూరి లక్ష్మీకాంతారావు నర్సరావుపేట, గినుపూడి చెంచు సుబ్బరావు, పొదిలి. కర్నాటి లక్ష్మీనారాయణ, సూర్యాపేట. ప్రధాన కార్యదర్శి శ్రీ కనమర్లపూడి గాంధీ కోటేశ్వర రావు, గుంటూరు. సంయుక్త కార్యదర్శులు శ్రీ అవ్వారు శంకరరావు వినుకొండ, శ్రీ కనమర్లపూడి తిరుమల రావు నెల్లూరు, శ్రీ తేరాల రామారావు ఖమ్మంమెట్టు, శ్రీ నంబూరు మల్లికార్జునరావు గుంటూరు, కోశాధికారి శ్రీ దేసు సుబ్బారావు విజయవాడ.

Licence No.50 POST WITHOUT PREPAYMENT
VYSYA PRABODHINI R.N. 15861/69. Postal Regd. No. H-CD-1

Printed, Edited & Published by P. Lakshmi Kantham Sresnty
M/s. Vasavee Printers, CUDDAPAH - 516 002. ✆ : 45025.